# పదేళ్ల పిల్ల



రచయిత:—

వారణాశి

# మాట

—:0:—

ఇది నక్షత్రమాలకి చెందిన రెండో నక్షత్రం. ఇతివృత్తం శరత్ బాబుది. వంగ సాహిత్యంలో శరత్ బాబు రచనలు అందరికీ సులువుగా అవగాహనం కావని పెద్దలంటారు. సాంఘిక రచనలలో మానవుల మనస్తత్వాలని తరిచి తరిచి వ్రాసే వాళ్లలో శరత్ బాబు మొదటి రచయిత. అతని అనుభవం గొప్పది. స్వయంగా రవీంద్రుడే అతని రచనలకి ఆశ్చర్యపడి శ్లాఘించాడు. నేను అతని భావాల్ని కొంతవరకూ తీసుకున్నాను—సాధారణ జనానికి కూడా బోధపడే లాగున స్వయంగా వ్రాశాను. వ్రాతవలన హృదయాల్లో కొంతమార్పు కలగాలని నా కోరిక. అది ఎంతవరకూ సఫలమౌతుందో పెద్ద పెద్ద మహావరులున్నా పాఠకులున్నా చెప్పాలని ప్రార్థిస్తున్నాను. తప్పులుంటే పత్రికాముఖంగా గాని స్వయంగా గాని తెలియచేస్తే ధన్యుణ్ణి కాగలను. నన్ను ప్రోత్సహించాలని నా తెలుగుసోదరుల్ని వేడుకుంటున్నాను.

10–12–1940
విశాఖపట్టణం

మీ తెలుగు సోదరుడు
వారణాశి భానుమూర్తి
సరస్వతీ నికేతనం



రేపు కమలనాథరావు తండ్రి శ్రాద్ధదినం. ఈ రోజున అతని పినతండ్రి రామావధానికీ కమలనాభునకు మధ్య మన స్పర్థ జనించింది. రామావధాని అన్నగారి శ్రాద్ధకార్యం అతి శ్రద్ధతో భక్తితో కూడా నెరవేర్పించాడు. తాను భోజనం చెయ్యనూ లేదు. తనవారికి విస్తరి వేయనీయ లేదు. తనవలన తప్పు లేకుండా కమలనాభుడు, బ్రాహ్మణుల భోజనాలు ముగియగానే చేతులు జోడించి పింతండ్రితో అన్నాడుకదా, "బాబయ్యగారు, మీరు నాకు పితృసమానులు. నేను మీ కుమారునితో సమానమైనవాణ్ణి. ఈరోజున నావలన ఏమైనా పొరపాట్లు జరిగివుంటే క్షమింప వేడుకుంటున్నాను"

పితృతుల్యుడైన రామావధాని, "మీరు చెన్నపట్నాన చదివి, బి. యే. యం. యే ప్యాసయిన విద్వాంసులునాయన! మేము పూర్వకాలపు మూర్ఖులం. మాకు, మీకు పొత్తు కుదురదు" అన్నాడు. రామావధాని మాటల్లోగల భావం గ్రహించి కమలనాభుడు నాటినుండి పింతండ్రితో యేవిషయంలోనూ ఐక్యం కలిగించుకోకూడదని నిశ్చయించుకున్నాడు. తనతండ్రి పినతండ్రులకుకూడా, భోజనాదులుతప్ప విశేషమైనపొత్తు ఇతర విషయాల్లో వుండేదికాదు. ఇప్పుడు పరస్పరం ఒకరింట వొకరు విస్తరివేసుకోవడంకూడ ఆగిపోయింది.

కమల్ తండ్రి బోలెడు సంపద ఆర్జించిపోయాడు. ఇంట్లో "తన" అనేవారే కాకుండా ఆత్మీయు లొక్కరైనా లేరు. ఎటు తప్పినా ఒక్క మేనమామ, అతనిభార్య మాత్రం మునుపటి నుండి యిల్లు కనిపెట్టుకుని వున్నారు. ఇల్లు శూన్యంకాగా, చికాకుపుట్టి కొన్నాళ్లు దేశాటనంచేస్తే మనశ్శాంతి కుదురుతుం దనే మనోనిశ్చయంతో కమల్ తనగుమాస్తానుపిలిచి, "ఇదిగో, మా తండ్రి జీవించి వున్ననాటినుండి మా పొలాలూ యిల్లూ జాగ్రతగా చూస్తూవున్నట్లే మరికొంతకాలం చూస్తూ వుండాలి. ఇంతవేగం నేను తిరిగిరాను" అని తన సమస్తం అతనికి వప్పగించాడు. తాను నివసిస్తూవున్న యిల్లు మేనమామకు స్వాధీనపఱచి భద్రంగాచూడమనిచెప్పి కమల్ ప్రయాణించాడు.

కమల్ మేనత్త భద్రకాళి. మేనల్లుడు గుమ్మందాటుతూ వుంటే పెనిమిటిని పిలిచి రహస్యంగా, "ఇదిగో, అబ్బాయి వెళ్తున్నది దూరదేశంకాబోలు. పాపం శమించాలి; కీడెంచి మేలెంచమన్నాడు. అతనికే విపత్తు సంభవించినా చిక్కులు పడాలి మనం. రాతకోతలుంటే బాగుండేదిగా!" అని సలహా చెప్పింది! శతావధాని చెవులు మూసుకుని, "రామరామ! ఆలాటి అపభ్రంశపుమాటలు నోటినుండి రానీకు!" అన్నాడు. భద్రకాళి భగ్గున మండిపడింది—"మీకు తెలివితేటలుయేడిస్తే నేనలాగు మాటలాడకపోయేదాన్ని" అంటూ పళ్లు పట పట కొరుక్కుంది. శతావధానికి కొన్నిమాసాలు పోయింతర్వాత పెళ్లాం సలహా నిజమని తోచి ఎంతో నొచ్చుకున్నాడు.

ఏడాదివరకూ కమల్ ఆయాచోట్ల సంచరించి, "గయ" చేరుకుని తండ్రికి శ్రాద్ధకర్మ చేసి ఇప్పుడు సైతం యిల్లు చేరడానికి మనస్కరించక పోవడంచాత కాశీ వెళ్లాడు. ఇది అతనికి క్రొత్త వూరు కాదు. తాను బ్రతికివున్న రోజుల్లో కమల్ తండ్రి కమల్‌ను ఒకటిరెండుసార్లు కాశీదర్శనం చేయించాడు. వెలనాటిసంఘం వారెవరేనా యాత్రార్థం కాశీవస్తే పౌరోహిత్యం వేంకటావధాని గారిదే. మణికర్ణికాఘాటుకు చేరువలోనే వేంకటావధాని మేడ కట్టించాడు. చేతిలో చిన్న లెదరుబ్యాగు (తోలుసంచి) తో మధ్యాహ్నం కమల్ ప్రత్యక్ష మయ్యాడు వెంకటావధానికి. అవధానిగారు ఆకస్మికంగా కమల్ వచ్చినందుకు, విస్మయ పడ్డారు. మేడపైన గది ఖాళీగానేవుంది కాబట్టి దాన్ని కమల్ నివాసానికి విడిచిపెట్టారు.

మేడగదిలో నిల్చుండిచూస్తే దిగువగల వంటిల్లు కన బడుతుంది. ఒకనాడు కమల్ గదిలోనిల్చుండి వంటయింటివైపు రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. అతనిదృష్టుల్ని ఆకర్షించినది వంటసామగ్రి కాదుసుమండీ; వంటమనిషి. ఆగదిలో ప్రవేశిం చిన నాటనుండి అతడామెను తృప్తితీరని నేత్రాలతో చూస్తు న్నాడు. ఆమె విధవ. అందకత్తె. వయసుకత్తె ఔనో వయసు మళ్లినదో తెలుసుకోవడం దుర్లభం. కారణ మేమంటారా? ఆమె మొగం ఎప్పుడూ వాడినట్లే వుంటుంది. ఒక పదేళ్ల పసి బాలిక ఆ విధవకు తోడుగా వుంటూ ఆపనీ ఈపనీ చేస్తూ

ఆయింట్లోనే మసలుతూంది. కమల్ భోజనం అక్కడే కాబట్టి ఆమె వడ్డిస్తూ చాటున నిల్చుంటూ క్రొత్తకాబట్టి కొన్నాళ్లు గడిపింది. క్రమక్రమంగా, ఒక్క చోటవుంటే వకవిధమైన ఆత్మీయత కుదరటం స్వాభావికం కాబట్టెన్నీ తనకన్న కమల్ వయసున లేతవాడు కాబట్టెన్నీ ఆమె ఆతనికివడ్డించి ప్రతిపదార్థంలో గల రుచులు బోధపరుస్తూ తల్లికివలె తినిపిస్తూ వుండటం ప్రారంభించింది.

కమల్ తనతల్లిని యెరగడు. తండ్రి మాతృస్థానాన్ని ఆక్రమించి ఆలోటు కమల్‌కు కనబడకుండా పెంచాడు; కాని ఆ నటన ఈ విధవ ప్రస్తుతం చూపుతూవున్న ప్రేమవలె కోమలంగా గోచరించలేదు. తండ్రి చావువలన శూన్యమైన చోటు నిండటమేకాకుండా కమల్ హృదయం ఇప్పుడు మాతృస్నేహరసంతో నిండిందికూడాను. ఒకనాడతడు వేంకటావధానినిట్లా ప్రశ్నించాడు, "నేనెరిగినంతవరకు మీకెవరూచుట్టాలు లేరుకదా, ఈమె యెవరండీ?"

"ఒక బ్రాహ్మణస్త్రీ"

"మీకు చుట్టమా?"

"ఏమీకాదు"

"మీకెక్కడ సందర్భమైంది?"—

"అదోహ పెద్దగాథ. కూకీగా చెబుతాను. మూడు సంవత్సరాల క్రితం ఈమె తన భర్తతోనూ బిడ్డతోను విశ్వ

...ఏని దర్శించటానికి వచ్చింది. భర్త ఇక్కడ తన భౌతిక ...న్ని విడిచిపెట్టాడు. స్వస్థలంలో తనకు పట్టెడన్నం పెట్టే ...రొక్కరు లేరు. మణికర్ణికాఘాటున భిక్షమెత్తుకుంటూ ...ప్ చూచి జాలిపడి తీసుకొని వచ్చాను. స్వస్థలం దివి ...యాకా. అని తెలుసుకున్నాను.

* * *

౨

వంటయింట్లో కూర్చుని, సరస కూరలు తరుగుతూ వుంది. నెమ్మదిగా అడుగులేస్తూ కమల్ ఆ బాలికను సమీపించాడు. ఆమె తలవంచుకుని తన పనిలో నిమగ్న అయివుంది. అంతటి అందకత్తె ప్రపంచంలో అరుదుగావుంటుంది—"సరస!" అని సంబోధించాడు కమల్—త్రుళ్లిపడి సరస, "అయ్యా!" అంది.

"వంట వండగలవా"

"ఆఁ"

"ఏమేమి వండటం నేర్చుకున్నావు?"

ప్రత్యుత్తర మిస్తే ఎక్కువగా మాట్లాడవలసి వస్తుందని ఆమె నిరుత్తరఅయింది. అత డా బాలిక యింగితాన్ని తెలుసుకుని మాట మార్చి—

"నువ్వూ మీఅమ్మా యిద్దరూ ఇక్కడ చాకిరీ చేస్తున్నారా?" అని అడిగాడు.

సరస తలవంచుకుని, "ఔను" అంది.

"నీకు జీతం ఏమాత్రం?"

"జీతం మాఅమ్మ కిస్తారు. నాకు తిండి పడేస్తారు"

"కేవలం భోజనానికే చాకిరీ చేస్తున్నావా? అట్లాగైతే నేను తిండిపడేస్తే నాపనులు సైతం చేస్తావా?"

"అమ్మతో ఆలోచించి చెబుతాను"

"తప్పకుండా చెప్పు"

కమల్ వాటమనిషి చరిత్రను కనుగొన గలిగాడు. కాబట్టి వారికి తోడ్పడాలనే దృఢసంకల్పంతోనూ, బాలిక చక్కనిది కాబట్టిన్నీ ఆమె అభిప్రాయం తెలుసుకోవాలని పైవిధంగా ప్రశ్నించాడు. వీరిసంభాషణ ముగిసీముగియడంలో వేంకటావధాని గంగాస్నానం చేసుకుని లోపలకి వచ్చాడు. అతనితో రెండు నిముషాలు సంప్రదించిన తర్వాత కమల్ తన గుమాస్తాపేర ఈవిధంగావ్రాశాడు:—"ప్రస్తుతం నేను కాశీలో వున్నాను. ఒక నెలలోగా నావివాహం ఇక్కడేజరుపుకుంటాను. మా. మేనమామగారితో ఈ శుభవార్త చెప్పి కొంతధనం, కొన్నినగలు, మరికొన్ని వివాహానికవసరమైన వస్తువులు తీసుకుని వీలైనంత వేగం రావాలి!"

ఆ నెలలోనే సరసా కమలనాభుల పెళ్లి వైభవంగా జరిగింది. భర్తతో బయలుదేరకముందు సరస అన్నదికదా, "మా అమ్మమాట యేమిటి?"—"మనతో ఆమె రాగలదు!"

అన్నాడు కమల్. ఈమాట తల్లి చాటునుండి విని కూతుర్ని పిలిచి, "చిట్టితల్లీ! అత్తవారింటికి వెళ్లి నన్ను మరిచిపోగలవు. అప్పుడప్పుడు నన్ను తలుస్తూవుండు. నోట "అమ్మా" అని మాత్రం వెలువడనీయకు. నేను బ్రతికివున్నంతకాలం కాశీలోనే వుంటాను. మీరిద్దరూ ఎప్పుడేనా ఇక్కడకు రావడం సందర్భమైతే కలుసుకోగలం" అన్నది.

సరస తెంపులేకుండా వెక్కివెక్కి యేడుస్తూంది.

"అన్నీ తెలిసినదానవు నువ్వే ఇట్లా దుఃఖిస్తే నేనేం చేయగలనమ్మా!" అని తల్లి తన పంచకొంగుతో సరస కన్నీటిని వొత్తింది. "అమ్మా! నువ్వు యేడ్చి నన్ను దుఃఖపెట్టకు. అప్పుడే నీమాతృభక్తిని నువ్వు చూపగలదానవౌతావు" అని హెచ్చరించింది—సరస గుండె పదిలపర్చుకుంది—ఒక్కసారి మాత్రం "అమ్మా" అని తల్లికౌగిటనుండి ఎడపడి నిల్చొంది. కమలనాభు డత్తగారిని సైతం తనతో రమ్మని చాలవరకు బోధించాడు. ఆమె రావీలులేదని నిష్కర్షగా చెప్పడంచాత "సరే, మీ యిష్టం. ఇంకొకవూరు వెళ్లడాని కిష్టపడకపోతే ఇక్కడేవుండండి కాని స్వతంత్రంగా వుంటారని నమ్ముతాను' అన్నాడు. కమల్.

"నేను స్వతంత్రనుగా వుండను. అవధానిగారు నన్ను కన్నకూతురువలె చూచుకుంటున్నారు. నేనతణ్ణి పితృసమాననిగా చూస్తున్నాను. ఆపత్సమయంలో అవధానిగారు నాక

చేయూత యిచ్చారు. వారిని విడిచిపెట్టలేను” అని బట...
చెప్పింది బ్రాహ్మణస్త్రీ.

స్వయంగా వకరికి స్వాధీనపడునట్టి ఆడుది ఆడుకాదు... ఆత్మగౌరవం ఆమె లక్ష్యమనిన్నీ తెలుసుకుని కమలనాథ... భార్య సరసతో సహా స్వస్థలానికి బయలుదేరి పోయాడు. ఆపెద్దభవనం—భవనాంతర్భాగంలోగల అలంకారసామగ్రి—అన్నీ చూసి సరస విభ్రాంతపోయింది. “ఆహా! ఇతనికి నామీద ఎంత దయా!!!” అని మనసులో అనుకుంది? ఎంతో అదరణచూపి కమల్ భార్య నడిగాడు, “ఇల్లూ వాకిలీ నీకు నచ్చిందా?”

చేతిగుడ్డతో మొగము కప్పుకుని తలవంచుకుంది సరస. కమల్ తన భార్య అభిప్రాయాలు తెలుసుకోవాలని కోరలేదు కాని ఆమె కంఠస్వరాన్ని వినాలని కుతూహలపడుతున్నాడు. తన రెండుచేతులతో సరస చిబుకాన్ని పట్టి పైకెత్తి “ఇదిగో ఈయిల్లూ వాకిలీ నీకు నచ్చిందా?” అని మళ్లీ అడిగాడు.

“అంతామీదేకాదా?” అని సరస చిన్ననవ్వుబలికించింది.

కొన్నిదినాలు ఈలాగే గడిచినై. ఇపుడు సరస వయసున పెద్దది. భర్తగా రేదేనా చెప్పకముందే ఆమె అతని వుద్దేశం గ్రహించి అతనికి సమస్త సేవలూ చేస్తూవుంది. ఆమెను దాసిగా లెక్కించాలంటే ప్రపంచమంతటా ఎన్నికాగడాలు పెట్టి వెతికినా ఆలాటి అందమైనదాసి దొరకడం దుర్లభం. కాని దాసిగా ఎంచుకోవడాని కెవ్వరూ పెళ్లాడరు. స్త్రీవ...

సేవలే కాకుండా ఇంకా కొన్ని పనులు తీసుకోవాలని వాంఛి స్తారు మగవారు. సరస ప్రవర్తన అమాయకమైనదిగాను, విశ్వాసము కృతజ్ఞత చూపునదిగాను గోచరించింది కమలునకు. కాబట్టి దాంపత్యంలోగల సంపూర్ణసౌఖ్యం అత డనుభవింప లేకుండా వున్నాడు. ఆ వుభయులమధ్యనూ ఏదో పరదా వంటిది దురూహ్యంగా ఆవరించి వుంది. ఒకనాడు కమల్ ప్రశ్నించాడు—"సరస! నువ్వు ఎప్పుడూ భయపడుతూ వున్న ట్లుంటావేం? నేనేమయినా దుర్వ్యాపారం చేస్తున్నానా?"

సరస తనలో అనుకుంది—"ఈ ప్రశ్నకు మీకు ప్రత్యు త్తరం తెలియదా? మీరు దైవసమానులు, గొప్పవారు. నేను క్షుద్రురాలిని. మీరు పరిపాలకులు. నేను మీ ఆశ్రితను. మీరు దాతలు. నేను భిక్షుకురాలను"

సరస హృదయమంతా కృతజ్ఞతతో నిండివుంది కాబట్టి ఆమె ప్రీతి పెంపొందలేకపోతూవుంది. ఆమెలో గల ప్రేమ, నీటియొక్క అంతఃప్రవాహంవలె, నెమ్మదిగా, అవిచ్ఛిన్నంగా విరామంలేకుండా ప్రవహిస్తూంది హృదయములో. ఆ విషయం కమల్ తెలుసుకోలేదు. ఈనాడు తామరపూలవలె పెద్దవిగా నున్న ఆమె కండ్లవెంబడి కన్నీరు కారటం చూశాడు కమల్. దివ్యంగా వెలుగుతూవున్న ఆ జ్యోతి వెలుగులో ఆమె ముఖ సౌందర్యం ఎలాగుందో వర్ణించటం కష్టం అంటే చాలును.

తన చేతులతో ఆమె శిరసును తన ఛాతీకి అత్తుకున్నాడు-
"ఇదిగో సరస! నన్ను చూసి భయపడుతున్నావు. అందుకే కళ్లు
మూసుకున్నావు. ఇంకా నన్ను నువ్వు బోధపర్చుకోలేదు.
నేను నిద్రలోవుండగా ఒకటి-సారి నన్ను బాగాచూడు. నీభయం
పోతుంది" అని హెచ్చరించాడు.

"నేను మీదాసిని. దాసిగానే నన్ను చూస్తే చాలు.
ఇంతకన్న గౌరవనీయమైన చోటు నాకు అనవసరం" అంది స

** ** **

3

కమలనాభుని మేనత్త భద్రకాళికి ఇప్పుడు రవంతైనా
సుఖం, హాయి లేకుండా వుంది. ఈశ్వరు డొకొక్కరి నట్లా
బాధిస్తూ వుంటాడు. కొందర కీ ప్రపంచం కంటకమయమైన
ఘోరాటవీతుల్యంగా వుంటుంది. అట్లాంటివారికి ఆ ముళ్ల
త్రోవని ఛేదించుకుని తమకోసం సుఖమయమైన దారి వెతు
క్కోవడం దుర్లభ మవుతుంది. ఈ ప్రయత్నంలో కొందరకు
ఫలం దొరుకుతుంది. మఱికొందరకు దొరకదు. భద్రకాళి
కొద్దికాలంనుండి ఈ ప్రపంచ మనే అరణ్యంలో తనకోసం వక
చక్కని త్రోవ వెతుకుతూవుంది. కమలనాభుని తండ్రి చావు
వలన ఆమె కొకత్రోవ కనబడింది; కాని కమలనాభుని ఆకస్మిక

వివాహామున్నూ, అతనికి సరసపైగల అమిత ప్రేమయున్నూ, ఈ త్రోవకి అడ్డంకులు కల్పించినై. తన మేనగోడల్ని కమలున కిచ్చి తా నతని యావదాస్తికి కమలుని ఆదిభౌతిక శరీరానికీ ఆధ్యాత్మిక శరీరానికీ కూడా అధికారిణి కావడానికి ప్రయత్నించింది; ఇపుడు తన ఆలోచనలన్నీ వమ్మైపోయినై. ఆమె మనసుకి శాంతి లభించటంలేదు.

ఇప్పుడేనా భద్రకాళియే గృహకార్యాలు చక్కపెట్టుతూ వుంది. ఇప్పటికీ ఆమెభర్తయే ఇంటియజమాని. సరస భద్రకాళి మొగముచూచి లోలోన అసహ్యపడేది కాని లేశమైన తన భావాన్ని బయటకు ప్రకటించేదికాదు. భద్రకాళి ఎన్నివిధాల అధికారరీత్యా సరసని అణగద్రొక్కాలని ప్రయత్నించినా, సరస లొంగకుండా వుంది. ఈయిద్దరికీ ఆత్మలలో పరస్పరంమహాసంగ్రామం నిత్యం జరుగుతూవుండేది. సరసయే గెల్చుకుంది. ఆమె శాంతభావం ప్రకటిస్తూవున్నకొలదీ భద్రకాళి మండిపడుతూవుంది. కాని ఏమీ చేయలేకపోయేది.

* * *

వయసును గౌరవించే జ్ఞానం మగవారికివున్నట్లు ఆడవారికి వుండడం దుర్లభం. ముప్పై సంవత్సరాల మగవాడు 20 యేళ్లు వయసుగల యువకునితో చెలిమిచేయగలడు. ఆడుది పెళ్లిఅయేవరకు అమ్మా, అప్ప, అవ్వ మొదలైనవారి అండను

చిట్టిపాపవలె మసలుతూ పెళ్లికాగానే తాను స్త్రీ జీవితానికి అవసరమైనపలుకులు నాలుగు నేర్చుకుని వక ఉన్నతాసనం అధిష్ఠిస్తుంది. ఆయా ప్రాంతాలలో ఏవో కొన్ని ప్రభేదాలు ఈలాటి స్వభావంలో కలుగవచ్చును కాని సాధారణంగా స్త్రీలందరిలో ఇల్లాంటిస్వభావం వుండితీరుతుంది.

ఒకనాడు సరస తనమేడమీది పడమటివైపు గల గది లోని కిటికీదగ్గర నిల్చుండి పెరట్లోవున్న చెట్లవైపు నిదానంగా చూస్తూవుంది. వెంకమ్మ చేత మిఠాయిపళ్లెం వుంచుకుని సరస వెనుకకువచ్చి, "ఇదిగో! స్వీకరించు. నేటినుండి నువ్వూ నేను చెలికత్తెలం. నన్ను "చెలీ" అని పిలవాలి నువ్వు" అంటూ పచ్చని దారపుపోగు సరస మణికట్టున చుట్టింది. పక పక నవ్వింది.

వెంకమ్మ వయసు 60 సంవత్సరాలు. పళ్లు లేవు. వృద్ధత్వం ఆమె మొగాన స్పష్టంగా గోచరిస్తుంది. కమలనాభు నకు ఆమె దూరపుచుట్టము. ఆమెను కమల్, "అమ్మమ్మా!" అని పిలుస్తాడు. సరస, వెంకమ్మచేష్టకు లోలోన నవ్వుకుంది. సమవయస్క కాదామె. పొత్తెట్లా కుదురుతుంది? "చెలీ" అని పిలువకపోతే ఆమె నొచ్చుకుంటుందేమో! హఠాత్తుగా ఆమెతో పొత్తుకలుపుకుంటే ప్రమాదిస్తుందేమో! ఈ ఆలోచ నలలో మునిగి తేలుతూవుంది సరస. ఎంతసేపైనా జవాబు ఆమె

నోటనుండి వెలువడకపోగా బోసినోరు వెంకమ్మ కినిసి, "ఆదార ప్పోగిట్లాతే! నాతో స్నేహాంచేస్తే ముప్పా? నీ కీ వూరులో చెలికత్తె వక్కర్తె లేదు. భద్రకాళి నీతో సరిగా మాట్లాడదు. పోనీ, నువ్వు మంచిదానవుకదా, కాలక్షేపం చేస్తూ వుండ వచ్చునని అభిమానంగా నిన్ను సమీపిస్తే ఆట్టే ఆలోచిస్తు న్నావు!" అని వూపిరితీయకుండా లెక్చరు కొట్టింది. తుదకు సరస, "నేటినుండి తమరూ నేనూ చెలికత్తెలం!" అంది—మళ్లీ వెంకమ్మకి కోపంవచ్చింది—"ఆఁ! తమరు అంటున్నావేం? "నువ్వు" అనరాదూ?" అంది—సరస ఆలాగే అని సంబో ధించింది ఇష్టంలేకపోయినా. ఈ స్నేహాం రాను రాను దృఢ పడింది. వెంకమ్మ వేయిపనులు మానుకునిఅయినా ఒక్కసారి సరసకు "అట్టోడెన్ను" యిచ్చిపోతూ వుండేది—ఈ యిద్దరి స్నేహాం భద్రకాళికి నచ్చిందో లేదో మనం చెప్పలేము కాని కమలనాభుడు మాత్రం సంతోషించాడు తన భార్యకు కాల క్షేపాని కెవరో దొరికారని. అతడు సరసను సంపూర్ణంగా ప్రేమించకపోయినా ఆతనిహృదయంలో ఆమెపట్ల స్నేహాం మాత్రం లోటులేకుండా వుండేది. సరస అతనితో విస్తారం మాట్లాడేదికాదు. అతడు తనంత తానే ఇట్లా అనుకుని తృప్తి చెందేవాడు—"అందరకూ వక్కలాటి పెళ్లామే దొరకదు. కొందరకు దాసివంటిది, మరికొందరకు స్నేహితురాలివంటిది, ఇంకాకొందరకు యజమానురాలివంటిదీ లభిస్తుంది. నాపుణ్యాః

ఫలించి వక పవిత్రమైనదాని దొరికింది. ఇక విచారించి ప్రయోజనం యేముంటుంది? ఐనప్పటికీ, నన్ను పోల్చుకో లేకపోతూంది సరస. ఆమెను కాశీలో మొదటిసారి చూడగానే నేను పోల్చుకున్నాను. ఆమె యెన్నో యుగాలనుండి "నాది" అనుకున్నాను. నాదిగా చేసుకున్నాను. నన్నెందు కామె గుర్తింపకుండావుందో తెలీదు"

అప్పు డప్పుడు సరసను చేరదీసి అత డంటాడుకదా, "నన్ను నువ్వెందుకు గుర్తింపకుండా వున్నావు? భయపడుతున్నా వెందుకు?"—

నిజంగా సరస భయపడుతూవుంది. అతనికి తలుచుకుంటే ఎంతటి అందకత్తెలైనా వస్తారు. వక పేదపిల్లని అంతటి ఐశ్వర్యశాలి చేరదీశాడంటే అతనిదగ్గర ఆలాటి పేదరాలు, గృహిణికిగల అధికారాల్ని చూపడానికి భయపడదూ? కమల్ ఆమెను పెళ్లిచేసుకోకుండా వుంటే ఆమె జీవితాంతంవరకూ కష్టాలనుభవించాల్సివుండేదే? ఏదార్భాగ్యుడో లభించివుంటే ఆమె సౌందర్యం వృథా అయ్యేదే? కాబట్టి ఆమెసౌందర్యాన్ని చూసి మురిసి, ఆమె బాల్యజీవితంనుండి పడిన కష్టాలు విని కరుణించియే కమలుడు సరసను పెళ్లాంగా గ్రహించి ఉద్ధరించాడు. అందు కామె కృతజ్ఞత చూపుతూ వుంది. సేవలు చేస్తూ వుంది. కాని కమలు డామె కృతజ్ఞతకూ, సేవలకూ

ఆసించలేదు. ఆమె తన అర్ధాంగి—అధికారపూర్వకంగా ఆమె తనకు పెళ్లాంవలె ప్రవర్తించాలని కమల్ కోరిక. ఇదే వారిద్దరి నడుమను గల పరదా!!!

ఒకనాటి మధ్యాహ్నం కమల్ తన ప్రత్యేకపుగదిలో పరుండి పేపరు చదువుకుంటూ వుండగా చప్పుడుచేయకుండా సరస అతన్ని సమీపించి సగం సిగ్గుతోనూ సగం భీతితోనూ ఆతనిముఖం అవలోకిస్తూ నిల్చుంది. అదివరకా గదిలో ఆమె యెన్నడూ అడుగుపెట్టలేదు. ఆమెకాదు, ఆగదిలోనికి ఎంతటి వారికేనా ప్రవేశంలేదు. కమల్ ఆశ్చర్యంతో, "ఓహో! వెంకమ్మగారు రాలేదుకాబోలు, నేను జ్ఞప్తికి వచ్చాను" అన్నాడు. మంచంమీద కూర్చుండమని ఆజ్ఞాపించాడు. కాళ్ల వైపు కూర్చుంది. "చినుకులు పడుతున్నాయి. అందుచాత వెంకమ్మ రాలేదనుకుంటాను" అంది. కమల్ అన్నాడు, "అది కారణంకాదు. మా పినతండ్రిగారి చిన్నమ్మాయికి పెళ్లి కాబోతూవుంది. ఆపిల్లను చూట్టానికి చుట్టాలొచ్చారు. వెంకమ్మది యీరోజు హడావుడి అంతాను"—కమల్ కళ్లవెంబడి అప్రయత్నంగా కన్నీటిబొట్లు జాలుతున్నాయి. సరస ఆ అశ్రువుల్ని తుడిచి తాను కన్నీరుకారుస్తూ, "మీదుఃఖానికికారణం?" అని ప్రశ్నించింది.

"ఏమీలేదు, పినతండ్రి కూతురు పెళ్లికి మనం వెళ్లలేం! చుట్టపుచూపులకు కూడా మనకు కబురులేదు. మా పినతండ్రి

మనల్ని బహిష్కరించాడు. అతని సలహా లేనిదే పెళ్లి చేసుకున్నాను కదూ!"

"నన్ను పెళ్లాడి మీ పినతండ్రికి దూరమైనారు. మీరు కోరితే ఎందరో దాసీలు వచ్చేవారు. అతని సలహా తీసుకుని పెళ్లి చేసుకునివుంటే మీమనసుకు శాంతి వుండేది"

"నువ్వట్లా అనుకో. ఎందరో వస్తారు, ఔను. అందరితోనూ నాకు పని లేదుగా!"

* * *

రెండవరోజున వెంకమ్మ వచ్చింది. ఆమె ముఖభావం రోజూవలె లేదు. రాగానే బోసినోరు విప్పి, "చెలీ చెలీ" అని నేడామె బొబ్బరించలేదు. ఆడుకుందాం పేకతెమ్మని సరసను బలాత్కరించనూలేదు. అదోవిధమైన మాలిన్యం ఆమె మొగం మీద కనబడింది. సరస అడిగింది—"నిన్న నువ్వు రాలేదేం?"

"ఔను, వాళ్లయింట్లో ప్రేమవతికి పెళ్లి కాబోతూంది. ఆపనీ యీపనీ చేయడంతో నిన్న గడిచిపోయింది"

"విన్నాను. అంతా నిశ్చయమైపోయిందా?"

ఆ ప్రశ్నకు జవాబు చెప్పకుండా వెంకమ్మ, "చెలీ, నిన్నొకప్రశ్న అడగాలని వుంది" అన్నది.

"ఏంవిటది?"

"నిజం చెప్తావా?"

"తెలిసినంతవరకూ చెప్తాను"

"నామీద నీకు నమ్మకమేనా?"

"లేకేం?"

"కమలుడు నిన్నెలాగ ప్రేమిస్తున్నాడు?"

తలవంచుకుని సరస అన్నది, "నామీద అతనికి ఎంతో దయ"

ముసలిది అంది,—"దయేమిటి? బాగా, ఎక్కువగా, ప్రేమిస్తున్నాడు"

సరస కడుపు చేతబట్టుకుని నవ్వుతూ "అతని ప్రేమకు పరిమాణమెంతో నాకెట్లా తెలుస్తుందీ?"

వెంకమ్మ అబ్బురపడి, "స్త్రీ, తనపెనిమిటి తనను ఎంతగా ప్రేమిస్తున్నాడో చెప్పలేదా? ఈమాటలే నాకు భీతి కల్గిస్తున్నాయి" అంది.

"భయమెందుకు?" అన్నది సరస.

వెంకమ్మ సరస చిబుకం తన మునివ్రేళ్లతో పట్టుకుని, "ఇంతరూపం, ఈలాటి మంచిగుణం అన్నీవున్నప్పటికీ......"

** ** **

# ౪

వేంకటావధానిగారికి వక సందేహం మనసులో కొట్లా డుతూ వుంది. చూడటానికి మంచిమనిషల్లె వుండి చింకిపాతలు కట్టుకున్నవా డొకడు వంటమనిషివద్దకు రెండుమూడు రోజుల నుండి వచ్చి ఏమేమో సంభాషించి పోతున్నాడు. ఈవిషయం అవధానిగారి కెఱుక లేదని బ్రాహ్మణస్త్రీ వూహిస్తూవుంది.

ఒకనాటిమధ్యాహ్నం వెంకటావధాని తన పినతండ్రితో చతురంగం ఆడుతూవుండగా దిగువ మండువాలో గొడవ విన బడింది. ఆడుది కాతరస్వరంతో, "క్షమించండి. వీలుపడదు" అని దీనంగా బ్రతిమాలుకుంటూ వుంది. మగవాడు కఠోర స్వరంతో ఆమె నెందుకో బలాత్కరిస్తున్నాడు. తన యింట ఈవిధమైన అల్లరిజరగటం నిజంగా ఆశ్చర్యమే. అవధాని ఆట ఆపి క్రిందికిరాగా తన వంటమనిషి వకపురుషుని కాళ్లుపట్టుకుని బ్రతిమాలుతూ వుండడం చూశాడు. మగవా డంటున్నాడు, "సులోచన! నామాటవిను; లేదా నేను చెప్పినంత పనీ జరి పిస్తాను" ఏడుస్తూ వంటమనిషి అతనితో, "క్షమించు. ఒకసారి నన్ను పాడుచేశావు. ఇంకా ఈలాగేనా బ్రతుకనీయవా?" అంటూ వేడుకుంటూ వుంది.

"నీకూతురు ధనవంతునిభార్య అయివుండగా రెండువేల

రూపాయ లియ్యలేవూ? డబ్బు తీసుకుని నా దారిని నేను పోతాను” అని వా డంటాడు.

“నువ్వు తాగుబోతువు. రెండు వేలనగా యేమాత్రం. మళ్లీ వచ్చి డబ్బు తెమ్మంటావు. నీకొక గవ్వ యివ్వను” అని సులోచన అంటూంది.

“నేను తాగటం మాని వ్యాపారం చేసుకుంటాను. తిరిగీ నిన్నెప్పుడు డబ్బుకోసం కష్టపెట్టను” అని వాడంటాడు.

“నన్ను క్షమించు. ధనంకోసం నేను నా కూతుర్ని బాధింప దలచుకోలేను” అంది సులోచన.

ఇద్దరూ అవధానిగారిని కనిపెట్టలేను. గట్టిగా కేకలేస్తూ మాట్లాడుతున్నారు. సులోచన మొగంమెత్తి చూసినప్పటికి అవధానిగారు ప్రత్యక్షం. అవధాని ఆ మగవాణ్ణి సమీపించి, “ఎవరినడిగి లోపల ప్రవేశించావు?” అని గర్జించాడు. మగవాడు వెలవెలబోతూ కొన్ని నిముషాలవరకూ కొయ్యబొమ్మల్లె నిల్చున్నాడు. తాను అనుమతిలేనిదే ఆయింట్లో ప్రవేశించటం చట్టానికి విరుద్ధమని తెలుసుకుని పారిపోవడానికి ప్రయత్నించాడు; కాని అవధానిగారు వాడిచేతిని అదిమిపట్టుకుని మేఘ గర్జనవంటి స్వరంతో, “చెప్పవేం? ఎవరి ఆజ్ఞ పొంది ప్రవేశించావు?” అని మళ్లీ అడిగారు. పారిపోవటానికి దారి కనబడదు.

ఇక సాహసమే వాడికి శరణు; కాబట్టి ధైర్యం తెచ్చుకుని, "సులోచనతో పనిబడి వచ్చాను" అని జవాబు చెప్పాడు.

వాడి నోటినుండి చెడువాసన వస్తూంది. పాపాలు మూర్తీభవించాయా అన్నట్లుంది వాడిఆకారం. అవధానిగారు కోపావేశాన కళ్లెర్రచేసి, "ఎవరినడిగి వచ్చావురా?" అని మళ్లీ అడిగాడు.

వాడు బెదరలేదు. ఆ ధైర్యంచూసి అవధానిగారికి మంట పుట్టింది. పళ్లుకొరుకుతూ, "వెధవ! ఛండాలుడా! ఇప్పుడు, ఒక్క-క్షణంలో నిన్ను పోలీసువారికి అప్పగించగలనని నువ్వెరుగుదువా?" అన్నాడు.

వాడు మూతివిరుస్తూ, "తెలుసుకోలేకేం?"

"ఎరుగుదువుకాబట్టే నడువు" అన్నాడు.

వాడు వికారపు నవ్వు నవ్వి—"ఇప్పుడేనా?" అని ప్రశ్నించాడు. అవధాని వాడిమెడమీద గట్టిగా వకటితగిలించి, "ఇప్పుడే!" అన్నాడు. ఆదెబ్బ తిన్నతరువాత వాడికి స్థిరత్వం కుదిరింది. గంభీరంగా వాడన్నాడు, "బ్రాహ్మడా! వున్న బలమంతా వకేసారి ఖర్చుపెట్టకు. పోలీసువాళ్లకే అప్పగించుతావో, ఖైదులో పెట్టించుతావో, కొంచం ఆగి పెట్టించు. నీ కాశీ కాపురం ఎత్తించేస్తానుసుమా!" అని తాటించాడు.

అవధాని కాశీలో నలభై యేళ్లనుండి నివసిస్తున్నాడు. పోకిరీలకు సాధారణంగా కాశీబ్రాహ్మలు భయపడి తరచు వారిని చేరదీస్తూ వుంటారు. పాతపిల్లులు పోకిరీలతో కలిసి మెలిసి వుంటారు కాబట్టి భయపడరు. వాడు బెదిరించటంతోనే అవధానికి క్రోధం అమితమై పిచ్చియెత్తినట్లు కేకలేస్తూ "త్రాగుబోతువెధవా! నీబ్రతుకుచూడు, నువ్వుచూడు. నన్నట, కాశీనుండి వెళ్లగొట్టుతాడట!" అని సకిలించాడు.

"పురోహితుడా, నువ్వు కాశీ పండాగా చాల నాళ్లనుండి వున్నావని యెరుగుదును కాబట్టి నీ మేలుకోసం చెబుతున్నాను. నామాట లక్ష్యపెట్టక పోలీసువాళ్లకి అప్పగించావా, అక్కడే నీబ్రతుకు బయటపెడతాను. పద, మరీ!" అన్నాడు.

"నాకు రహస్యంయేముందిరా?" అనిఅడిగాడు అవధాని.

"నే నెఱిగినదేదు. అది బయటపెడితే నీకు నీళ్లుకూడా పుట్టవు. నువ్వు బ్రాహ్మడవో అబ్రాహ్మడవో లోకం తీర్పు చెబుతుంది" అన్నాడు వాడు.

"ఆఁ! నేను జాతిభ్రష్టుడనా? అబ్రాహ్మణ్ణా?" అని అబ్బురంతో అన్నాడు అవధాని.

"పురోహితుడా! నువ్వొకడవే జాతిభ్రష్టుడవుకాలేదు. నేటికి మూడు సంవత్సరాలనుండి నిన్ను నమ్మి వచ్చి నీయింట

విందారగించిన వాళ్లందరూ జాతిభ్రష్టులైనారు. వాళ్లందరితోనూ చెబుతాను" అన్నాడు వాడు.

వెంకటావధాని శరీరం చెమ్మగిలిపోయింది. భీతి పుట్టింది. భీతికి మూలకారణం తెలియకమునుపే అతని గంభీరస్వరం సన్నగిలిపోయింది. "ఔరా, ప్రజల్ని జాతిభ్రష్టుల్ని చేశానంటావా?" అని ప్రశ్నించాడు. వాడు గట్టిగా, "నేను రుజువు పరుస్తానంటున్నానుగా!" అన్నాడు.

"అదేదో వివరంగా చెబుతావా?"

"నువ్వొక్కడవే వింటే చెప్పను. పదిమందిలో చెబుతాను"

"బాబూ! నీపట్ల అన్యాయం చేశాను. నాది తప్పు. కోపగించుకోకుండా చెప్పు"

ఇద్దరూ ఒకగదిలో ప్రవేశించిన తర్వాత—

"ఈ వంటమనిషి, సులోచన, నీకెక్కడ దొరికింది?"

"ఇక్కడే! కూటికిలేక దేవులాడుతూవుంటే ఆశ్రయం ఇచ్చాను"

"ఔను దరిద్రురాలికి ఆశ్రయ మిచ్చావు. ఐశ్వర్యవతికి కాదు. ఆమె జాతి యేమిటి?"

అవధానిగారిమొగం వాడింది; "బ్రాహ్మణస్త్రీ. వితం

తువు. మంచి నడవడిగలది. ఆమెచాత వండించితే తప్పేమిటి?” అని ప్రశ్నించాడు అవధాని.

“ఆమె బ్రాహ్మణస్త్రీ. వితంతువు. అన్నీ నిజమేను. ఎవడితోనో లేచివచ్చినదాన్ని సత్ప్రవర్తనగలది అని సిద్ధాన్తీకరిస్తున్నావే?”

అవధాని:—“శివ! శివ! ఆమెచేతులతో వండించి తిన కూడదురా!”

వాడు:—సులోచన పది సంవత్సరాల క్రితం అప్పటికి మూడేళ్ల కూతుర్ని తోడ్చుకొని యిల్లు విడిచిపెట్టి పోయింది. దానికి నువ్వాశ్రయమిచ్చి నువ్వు స్వయంగా చెడి అందరినీ చెడిపేశావు.

అవధాని:—“ఆమె లేచివచ్చినట్లు ప్రమాణం?”

వాడు:—ఓ ప్రమాణం వుంది. ఆమె యవరితో లేచి వచ్చిందో అతడు సుబ్బావధాని. ఇంతవరకూ జీవించివున్నాడు

అవధాని అనుమానించి ఇతడే సుబ్బావధాని అయి వుంటాడని స్థిరపర్చుకున్నాడు—“నువ్వు బ్రాహ్మణుడవేనా?” అని ప్రశ్నించాడు

సుబ్బావధాని ముణికినుస్తులకన్న నల్లనైన యజ్ఞోపవీతపు పోగులు బయటకులాగి చూపుతూ వెర్రినవ్వు నవ్వి, “ఆహా! బ్రాహ్మణ్ణే!” అన్నాడు.

అవధాని:—"చూపునకు మాదిగవాడివలె వున్నావు. కాని నీకు నమస్కారం!"

సుబ్బా:—నమస్కారం! నీఅనుమానం సత్యమైనదేను. నేను మహమ్మదీయుడను. క్రైస్తవుడను. మాదిగవాణ్ణి. మాలవాణ్ణి—నాకు జాతిభేదం లేదు. పరమహంసని—

అవధాని:—నువ్వు నరమాంసం తింటావు. దుర్మార్గుడవు. రాక్షసుడవు.

సుబ్బా:—నువ్వు మళ్లీమళ్లీఅనడం అనవసరం. నీవలె ఎందరో సత్పురుషులు నాకు నీతులు బోధించారు. మొదట నేనెవడనో ప్రస్తుత మెవడనుగా మారిపోయానో నేనెఱుగుదును. నేనెవడనైతే నీకేం? సుబ్బావధానిని నేనే!!!

వెంకటావధాని మొగం ఎక్కువకోపంవలన ఎఱ్ఱబారింది. తన మనోభావాన్ని ప్రయత్నపూర్వకంగా దాచుకుని అన్నాడు—"ఇప్పు డేం చేయాలనుకుంటున్నావు. సులోచన కావాలా?"

వా డన్నాడు—"అవసరం లేదండీ! ఆమెని తీసుకొనిపోతే మీకుశ్రమ. వండిపెట్టేవాళ్లుండరు. మిమ్మల్ని కష్టపెట్టేనంతటి అధముణ్ణికాను"

ఈ పరిహాసం వెంకటావధానికి కష్టంగా తోచింది. ఏం చేయగలడు?

"ఐతే నీకుకావలసిందేమిటో చెప్పు?" అని అడిగాడు.

"డబ్బు. చాల కష్టదశలో వున్నాను. రెండు వేలకు మించకుండా తగ్గకుండా ఎంతయిచ్చినా పోతాను"

"అమ్మయ్యో! అంతధనం ఎవరిస్తారు? ఎవరీయగలరు?"

"అవసరం వున్న వాళ్లిస్తారు. సులోచన అల్లుడిస్తాడు. తమ రిస్తారు"

సుబ్బావధాని ధైర్యంచూసి వేంకటావధానికి వెన్ను విరిగింది.

"సోదర! నేను బీదవాణ్ణి. అంత లంచం ఇవ్వలేను. సులోచన అల్లుడు ఇవ్వ సమర్థుడే కాని ఇవ్వడు. అతణ్ణి నువ్వు గుర్తింపలేవు. రెండు వేలు కాదుకదా రెండు డబ్బులు సైతం బెదిరించి నువ్వతనిదగ్గర పుచ్చుకోలేవు. నువ్వు బుద్ధిమంతుడ వని నేను వప్పుకున్నాను. నీకన్న అతడు బుద్ధిమంతుడు. ఇంకేదేనా వలపన్ను"

"సరే! ఆ ప్రయత్నభారం నాది. నువ్వు విచారించకు. ప్రయత్నిస్తే ఏది లభించదు?" అని సుబ్బావధాని పోబోతున్నాడు.

అతణ్ణి వెంకటావధాని ఆగమన్నాడు. అతడు తానొక్క క్షణం ఆగటానికి వీలుండదని చెబుతూ, "సులోచన అల్లుడెక్కడుంటాడు?" అని ప్రశ్నించాడు.

"అల్లుడి పైవిలాసం సులోచననే అడగరాదూ?"

"ఆమె చెప్పదు. నువ్వు చెప్తావా లేదా?"

"నేను చెప్పకపోతే ఏంచేస్తావు?"

"ఈ రోజునే ఇప్పుడే ఈ పుణ్యక్షేత్రంలో వున్న పురోహితులతోనూ పండాలతోనూ నీజాతిభ్రష్టత్వంగురించి చాటుతాను. ఆపైన నయాన్నో భయాన్నో సులోచననుండి అల్లుడిపై విలాసం సంపాదించి చూస్తాను. యత్నే కృతే యది నసిధ్యతి........."

వెళ్తున్నాడు. అవధాని అతన్ని మళ్లీ ఆపి.........

"ఆగవోయ్! బాబూ! చూడూ! నువ్వు నిజంగా బ్రాహ్మడవే?" అని అడిగాడు.

"ఆహా! నిస్సందేహంగా!" అని జవాబు చెప్పాడు సుబ్బావధాని.

"ఐతే ఒకవారంరోజులాగి నాదగ్గఱకిరా! ఎంతవీలుంటే అంతసహాయంచేస్తాను. ఈ వారంలోపుగా నువ్వీసమాచారం యవ్వరితోనూ చెప్పకు" అన్నా డవధాని.

"సరే! నేను వచ్చిననాడు నన్ను ఉత్తచేతులతో పంపితివా నీకు శ్రేయస్సుండదు"

అని తాటించి ఆవలకి చరచరపోయి సుబ్బావధాని తిరిగీ యింట్లో ప్రవేశించి, "ఏమయ్యా! నా మనీపర్సు మరిచి పో

యాను. రెండు రూపాయలు నాకు ప్రస్తుతం సప్లయి చేయగలవా?" అంటూ నవ్వడం ప్రారంభించాడు.

వెంకటావధాని అతని నవ్వు చూచి భయపడి అతడు కోరిన దిచ్చి సాగనంపాడు.

** ** **

౫

సులోచన ఎక్కడుంది? నేటికి మూడురోజులనుండి వేంకటావధాని దాహంకూడా పుచ్చుకోలేదు. స్నానం సంధ్య జపం తపం అన్నీ మానుకున్నాడు. యాత్రికుల్ని వెతకటం కూడా మానుకున్నాడు. సులోచన ఎక్కడ కనబడుతుందా అని గాలించి చూస్తున్నాడు. ఎన్ని కాగడాలు పెట్టి వెతికినా వెతికించినా ఆమె కనబడలేదు. తుదకు నెత్తి మొత్తుకుని, "అయ్యో! వక దిక్కు లేనిదానిని చేరదీసి పాపం కొని తెచ్చుకున్నానే! ఎంతటి దౌర్భాగ్యుణ్ణి, ఈశ్వరా!" అని విలపించాడు. తరువాత తన పింతండ్రిగారింటికి వెళ్లి తలుపుతట్టిపిలుస్తే ఎవరూ జవాబీయలేదు. తలుపు తోసుకుని తిన్నగా లోపలకి పోయి చూశాడు. పింతండ్రి వకగదిలో కూర్చుని ఒంటరిగా చదరంగం ఆడుకుంటున్నాడు. వెంకటావధానిని చూసి, "రావోయ్! ఈమెత్తు బాగుందో లేదో చెప్పవోయ్!" అన్నాడు

అతని పింతండ్రి. వెంకటావధానికి మంటపుట్టింది శరీరంలో. అత డన్నాడు, "ఒకవైపు జాతి నాశమవుతూవుంటే ఆడ్వోయ్ ఆడ్వోయ్ అని సస్తావేం?"—

పింతండ్రి:—ఆనాటి జగడం గురించి అంతా విన్నాను. జాతి పోవటం, రావటం అటుండనీవయ్యా. ఆనాడు నీమంత్రి పోతూవుంటే కాపాడుకో లేకపోయావు. ఏదీచూదాం, ఇప్పుడు కాచుకో!!

వెంకటా:—నీ మంత్రి మండిపోను; ఈ చదరంగపు బిళ్లలు నీతో రావు. పరం గురించి వక్కనాడేనా తాపత్రయ పడవుకదా! ఎప్పుడూ, ఎత్తులు, బెత్తులు అంటూ ఈ బల్ల ముందఅ కూర్చుంటావే? మోక్షం ప్రాప్తించేదెట్లా?

అని జరిగినదంతా సవిస్తరంగా ముచ్చటించాడు. ఇంత వరకూ నవ్వుతూవున్న పింతండ్రి మొగం పీడవ్రాలినట్లు కళా విహీనమై పోయింది. అతడు చాలాదూరం యోచనచేసి, "అబ్బాయి! సులోచన పతివ్రత!" అన్నాడు.

వెంకటావధాని వెంటనే, "ఔను. నేనుకూడా అట్లాగే అనుకున్నాను; కాని ఆడుది ఏపనికేనా సాహసించేదే కాబట్టి సుబ్బావధాని మాటలు నమ్మవలసి వస్తూవుంది" అన్నాడు.

పినతండ్రి:—రామ రామ. ఇట్లాంటిమాటలు నాచెవిని వెయ్యకు. మానవులు పాపపుణ్యాలు చెయ్యకుండా వుండరు.

ఈ విషయంలో నాదృష్టికి ఆడ, మగ, అందరూ వక్కటే సుమా! నీకు నీతల్లి విషయం జ్ఞప్తిలో వుందా, మఱిచి పోయావా?

ఆప్రశ్నవిని వెంకటావధాని తలవంచుకున్నాడు. కోపం కూడా వచ్చింది. అతను పళ్లు పట పట లాడించి అడిగాడు, "ప్రస్తుతం జాతి పోతూవుంది. దీనికి వుపాయం ఏదేనా ఆలోచిస్తావా?"

పినతండ్రి:—ఆలోచనకేముంది? తెలియకుండా పాపం చేస్తే దానికి ప్రాయశ్చిత్తం లేదా యేమిటి? ప్రాయశ్చిత్తం చేసుకో. అప్పటికీ జాతివారు వెలివేస్తే వెయ్యనీ. నువ్వు చిన్నవాడవుకావు. ఏభై యేళ్లకు పైబడివుంది నీవయస్సు. ఇంత వరకూ నీకు జాతి వున్నట్లూ ఇంకొక నాలుగైదేళ్లవరకూ లేనట్లూనా?

వెంకటావ:—నువ్వు సులభంగా అనేశావు కాని జాతి పోతే మతంపోతుంది మతంపోతే ఈశ్వరుడేమటాడో తెలీదు నీకు. నేను దేవుడికి జవాబేమని చెప్పేది?

పినతండ్రి:—ఒక దిక్కులేనిదానికి ఆశ్రయం ఇచ్చానని చెప్పు.

వెంకటా:—ఐతే సుబ్బావధాని మళ్లీవస్తే సులోచన అల్లుడి పైవిలాసం చెప్పేసేదా?

పినతండ్రి:—ఎన్నడూ చెప్పవద్దు. ఒక త్రాగుబోతుకి సహాయం చేస్తే ఒక తగుమనిషిని పీడిస్తాడు. నీనుండికూడా పైకం వసూలుచేస్తాడు.

వెంకటా:—చెప్పకపోతే నాపరువు తీసేస్తాడు. ఒక్క యజమాని కూడా నా యింటికి రాడు. నా కూటిలో మట్టి పడుతుంది.

పినతండ్రి:—భయంలేదు. ఎంతమాత్రం భయపడకు. ప్రభుత్వంవారి దయవలన నాకు నెలకు ఇరవై రూపాయిలు ఫించనువస్తుంది. ఇద్దరంతింటూ చదరంగం ఆడుకుంటూ గుమ్మం దిగకుండా హాయిగా కాలం గడుపుకుందాం.

ఇంత వృద్ధుడైనా తన పింతండ్రి నోటనుండి పసిపిల్లల నోటినుండి వచ్చినట్లు మాటలురావడం వెంకటావధానికి తెంపు లేని నవ్వు పుట్టించినై. అతడన్నాడు, "నాబరువు నీకెందుకూ? ఆ వెధవచాత నేను పరువు తీయించుకోవడమెందుకు?"

పినతండ్రి:—ఔను. నువ్వు పురోహితుడివి. కాశీ విశ్వనాధునికి వాహనం వంటి వాడివి. కమలుని పైవిలాసం ఒక మూర్ఖునకు తెలియచెప్పి అతణ్ణి అతని భార్యనీ ఆపదల పాలుచెయ్యడం. ఆబాలిక పుసురుపోసుకోవడం నీకు చెల్లింది కాని నాకు మనస్కరింపదు. ఈమాత్రం వ్యవహారానికి నన్ను సలహా అడగడం యెందుకు?

వెంకటావధాని మనసు కోపంతో నిండింది. మారు మాట్లాడకుండా చరచర నడిచి అవతలకు పోయాడు. అతని పితండ్రి తనలో ఆ రాత్రంతా ఆలోచించు కున్నాడిట్లా, "అబ్బాయి చెప్పింది నిజమే! ఒకరు నన్ను శవం మోయటానికి పిలుస్తారు. ఇంకొకరు చదరంగం ఆడటానికి ఆహ్వానిస్తారు. అందరతోనూ పని వుంటుంది. లోకం ఎలానడుస్తే మనంకూడా అలాగే నడుచుకోవాలి" ఇంకా ఏమేమో ఆలోచించి అతడు ఒక నిశ్చయానికి వచ్చాడు. కమలనాభుని పితండ్రి పేర ఒక వుత్తరంవ్రాస్తూ "మీఅన్నకుమారుడు స్వేచ్ఛమీద ఒక వేశ్య కూతుర్ని పెళ్లిచేసుకున్నాడు" అని దానిలో వుదహరించి పోస్టులో వేశాడు.

*　　*　　*

వెంకటావధాని కమలుని పినతండ్రికి వృత్తాంతమంతా వివరించి వుత్తరం వ్రాశాడు. కమలుని పినతండ్రి వుత్తరంలో గల విషయం అబద్ధం కానేరదనే నిశ్చయ పరుచుకున్నాడు. తన సలహా లేకుండా కమలుడు పెళ్లి చేసుకోబట్టి యీ ఘోర నింద వచ్చిపడిందని తనలోతాను సంతోషిస్తూ ఇప్పుడే తాను నలుగురికీ వెల్లడిచెయ్యడంకన్న తన భార్యతో ఆలోచించి నిజం స్థిరపర్చుకున్న తర్వాత వెల్లడిచేదామని వూహించి ఈ వార్త భార్యకి ఎరుకపరిచాడు. ఏరహస్యమైనా ఆడవాళ్ల చెవినిపడితే ఆయాస ప్రయాసాలు లేని న్యూస్ పేపరు వలె లోకమంతటా

వ్యాపించిపోతుంది. కమలుని పినతండ్రికూతుర్ని చూట్టానికి చుట్టాలూ స్నేహితులు వూళ్లోవున్న ఆడవాళ్లూ ఆనాడు కలిసి నప్పుడే వెంకటావధాని వుత్తరం కమలుని పినతండ్రికి చేరడం, అతడు ఆ సంగతి తనభార్య చెవిని వెయ్యడం తటస్థించింది. కమలుడు సులోచన కూతుర్ని ఎంత గాఢంగా ప్రేమిస్తున్నాడో తెలుసుకోవాలని, ఆడవాళ్లందరూ, సులోచన కూతురికి చెలికత్తె అయిన అవ్వగారిని రాయబారిగా పంపారు. కమలుడు ఆ బాలికని విడిచిపెట్టగలడా లేడా అనేది వాళ్లప్రశ్న. ఆమెని విడిచిపెడితే అంతుపోతుంది. లేదా ఆవూళ్లోవున్న బ్రాహ్మణ్యాం అందరూ జాతిభ్రష్టులక్రిందే లెక్క. సరసయొక్క ముందు జీవితం కమలుని ప్రేమమీద ఆధారపడి వుంది.

అందరూ తమలోతామే గుసగుస లాడుకుంటున్నారు. ఆడవాళ్ల హృదయాలు అతి కోమలంగా వుంటాయంటారు. సరస విషయంలో, ఆడవాళ్ల మొగాలుచూస్తే, వాళ్లకోమల హృదయాల్లో పైశాచికవృత్తి వున్నదో అన్నట్లు కనబడుతుంది. ఆడవాళ్లందరు లోలోపల ఎంతో కులుకుతున్నారు. పైపైన అందరూ విచారం సూచిస్తున్నారు. చుచ్చుకొడుతున్నారు. అడ్డువచ్చిన ప్రవాహంలాగున ఈమాట, ఆనోటా ఆనోటా తిరుగుతూవుంది కాని, అడ్డుతెంచుకుని ఒడ్డురాసుకుని బాహాటంగా ప్రవహించడంలేదు. ఇంతవరకూ ఆ వూళ్లో పొగ మాత్రం అలముకుంది. చిచ్చు మంట లెగవేస్తూ భగ్గుమనడం

లేదింకా. మగాళ్ల లోకూడా ఈ అలజడి పుట్టింది కాని యవరి కాళ్లమీద వాళ్లు నిలబడవలసిన ఈ డబ్బులేనిరోజుల్లో ఈలాటి చర్చలకు సమయం నష్టం పుచ్చడానికి యవరికీ అవకాశం చిక్కటంలేదు. సులోచన వేశ్యఅనీ ఆమెకూతుర్ని కమలుడు పెళ్లాడినాడన్నీ, ఆకారణంచాత అతని మేనమామ, మేనత్తా కమలునితోకూడా కులంలో లేగనీ ఇవిముఖ్యచర్చనీయాంశాలు.

భద్రకాళి తన మేనగోడల్ని కమలుని కిచ్చి పెళ్లిచేసి అతనియావదాస్తికీ అధికారిణి అవాలనుకుంది. ఈవార్త ఆమె కెంతో వుపకరిస్తూంది. ఆమె మేనగోడలింకా కన్యగానేవుంది. కమలుడు చదువుకుంటూవున్న గదిదగ్గరకు వెళ్లింది భద్రకాళి. ఆమెమొగం భయంకరంగా వుండడం చూసి కమలుడు విచార సూచకంగా అడిగాడు, "ఏంవిటత్తా కబుర్లు?" భద్రకాళి లేని దుఃఖాన్ని ప్రయత్నించితెచ్చుకుని ఎండాకాలపు చినుకుల్లాగున రెండు కన్నీటిబొట్లు కారుస్తూ, "నాయనా! మీ మామా నేనూ ఎంతటి దరిద్రులమైనా ఎంత, నీ పంచచేరినా ఇల్లాటి నింద వేయించడం బాగుందా?" అంది.

కమలుడు నిర్ఘాంతపోయాడు. తా నేమి అపరాధం చేశాడో తనకే తెలియదు.

భద్రకాళి మళ్లీ ప్రారంభించింది—"నాయనా! పట్టె డన్నంకోసం నిన్నుచేరి మా జాతి చెడగొట్టుకున్నాం. ఇంత

కన్న నాశం ఇంకేమికావాలో చెప్పు? ఆ ముండలు నిన్ను మోసపుచ్చి మాకొంపతీశారు" అంది. కమలుడు కోపంతో, "అసలు జరిగినసంగతి చెప్పకుండా నన్ను కంగారుపెడతావేం?" అని గర్జించాడు.

"మీ పినతండ్రి నడుగు" అంది.

"అతణ్ణి అడగటంయెందుకు? ఈమాత్రందానికి నువ్వెందుకు గుండె పగుల్చుకుంటూ వచ్చావు?" అన్నాడు.

"నాకూ ఆయనకీ నీళ్లయినా పుట్టేదారి కనబడదే, అడుగుదామని వచ్చాను"

"కనబడకపోతే మరోకొంప చేరుకొండి. అసలుసంగతి చెప్పకుండా ఏడుస్తే నాకు చికాకు"

"నువ్వేమీ యెరుగవా నాయనా?"

"ఎఱుగను"

"కాశీలో నువ్వు మా సలహా లేకుండా పెళ్లాడిన పిల్ల వేశ్య"

కమలు డాశ్చర్యపోయాడు.—

"ఆమె పెళ్లికాకముందునుండి వేశ్యావృత్తిచేస్తూవుందనా నీఅభిప్రాయం? అప్పటికి ఆమె పదేళ్లదేకదా?" అన్నాడుకమల్.

"ఆమె తల్లిమీద కాశీలో చెడ్డనింద పడింది"

"అంటే సులోచన వేశ్యావృత్తివలన జీవించేదా?"

"ఔనట!"

"శివ. శివ. ఆఉత్తరం ఏదీ?"

"మీ పింతండ్రిదగ్గరుంది"

ఈ ఘోరవార్త కమలుడు విన్నదే మొదలు, సిగ్గు అవమానంచాత గజగజ వణకటం ప్రారంభించాడు. ఆసమయంలో అతని మొగం చచ్చినవాని మొగంకన్న కళావిహీనమై, భయంకరంగా వుంది.

** ** **

౬

"బాబయ్యా! ఆ వుత్తరం చూపెట్టూ!"

సంచుకుపెట్టె తెరిచి కమలుని పింతండ్రి వుత్తరం పైకి తీశాడు. కమలుడు రెండుసార్లు వుత్తరం చదివినతరువాత,—

"దీనికి ప్రమాణం?" అని ప్రశ్నించాడు.

"సుబ్బావధాని స్వయంగా వస్తున్నాడు"

"అతని మాటలు మాత్రం నమ్మతగినవా?"

"దానికి నేను జవాబుచెప్పలేను. ఇప్పుడు నీకు తోచినట్లు ఈనింద బాపుకో"

"ఈనింద రుజువుచేసి సుబ్బావధాని ప్రయోజనం పొందుతాడా? అతనికి కావాల్సిందేమిటి?"

"రెండువేల రూపాయల కోసం ఈమాటలోవున్న నిజం స్థిరపరుస్తానని వుత్తరంలోనే వుదహరించేడుగా?"

కమలుడు స్థిరదృష్టితో పినతండ్రి మొగాన్ని చూసి, "ఈవిషయం వెల్లడికాకుండావుంటే వాడు లాభంపొందేవాడే. ఇప్పుడు వాని పప్పుడకదు. మీరు నాకు ఒకవిధంగా ఉపకారం చేశారు. డబ్బు మిగిలిపోతుంది" అన్నాడు.

ఔను, నిజంవే! పినతండ్రి సిగ్గుతో తలవంచుకున్నాడు. ఈ వార్త తాను వెల్లడిచేయలేదని కొడుకుతో చెప్పేదామా అనుకున్నాడు. తనవల్లనే అది వెల్లడైంది. తాను తనభార్యకు చెప్పటం ముప్పు వచ్చింది. వెల్లడికాకుండా వుంటే సుబ్బావధాని కమలుణ్ణి బెదిరించి రెండువేలూ మూట కట్టుకునేవాడే.

కమలుడు పినతండ్రిని, "బాబయ్యా! ఇది నావూరు. నావూరిలో నాయింటికి వచ్చి సుబ్బావధానివంటి భిక్షుకుడు నన్ను అవమానించగలడా? సరే, వాణ్ణి అడుగుతాను రాసియ్యండి; కాని నేనుచస్తే మీరు హాయిగా వుంటారా?" అని ప్రశ్నించాడు.

పినతండ్రి:—రామ రామ. నాయన! ఇల్లాంటి చెడు మాటలు నాచెవిని వెయ్యకు.

కమల్:—బాబయ్యా! ముందు ముందు వెయ్యనుగాని మీరు నాకు పూజ్యులు కాబట్టి నేను చెప్పినది సావధానంగా

వినండి. దేవుడుమీద ఒట్టువేసుకుని నాసంపద యావత్తూ మీకు ధారపోస్తాను. నేనెక్కడకుపోతానో అక్కడకు నెలకు కొంతధనం నా ఖర్చులనిమిత్తం పంపుతూ వుండండి. చేతులు జోడించి మిమ్మల్ని నే నీమాత్రం వేడుకుంటున్నాను. అంతే గాని నన్ను నాశం చెయ్యకండి!!

పినతండ్రి:—బాబూ! నువ్వింతగా చికాకు పడవలసిన అవసరం లేదు. దూరంగా పోనక్కరలేదు. నీ యావదాస్తి నా పేర వ్రాసియిచ్చి నువ్వు ఫకీరువు కానవసరం లేదు—ఇంతో అంతో నేను పెద్దవాణ్ణి. నామాటవిను. సరసను విడిచిపెడితే ఈ నింద బాసిపోతుంది. ఈ చిక్కు విడిపోతుంది.

కమల్:—సరే సరసని వదలి...?

పిన:—ఇంకోపెళ్లి చేసుకో! సరస వేశ్యఅనేది స్థిరమైన మాట. తరువాత దానిని నేను నీకు రుజువుచేస్తాను.

కమలుడు నటికిన అరటిబోదెలాగున దబ్బున నేలపడ్డాడు. అతని శరీరంలో ఏదో విషజంతువు ప్రాకినట్లయింది. కొన్ని నిముషాలత డీ బాహ్యప్రపంచాన్ని విడిచి ఎక్కడెక్కడో సంచారంచేసి తిరిగి తన బొందెలో ప్రవేశించాడు. పింతండ్రి వేపు ఎఱ్ఱిగా చూశాడు. తనయింటికివెళ్లి ఒకగదిలో ఏమేమో ఆలోచిస్తూ కూర్చుండిన సరసని సమీపించి, “నీలాపనింద విన్నావా?” అని అడిగాడు.

సరస:—ఆ విన్నాను.

కమల్:—ఇన్నాళ్లూ నాతో ఈగుట్టు విప్పి చెప్పలేదేం? ఎంతో చక్కనిదానివని ఎంతో మెత్తనిస్వభావం గలదానివనీ అనాథవనీ కరుణించి పెళ్లాడినందుకు నన్ను మోసంచేస్తావా? నీకు సంబంధించిన చరిత్ర రహస్యమైనది కాబట్టి నావైపు తల యెత్తిచూడకుండానే నాసేవలు చేస్తూ కాలంగడుపుతున్నావు. అదురుతూ బెదురుతూ ఆటలాడుతున్నావు. ఈరహస్యం తెలుసుకోలేక నేను నా జీవితంలో నా దాంపత్యజీవితంలో ఏదో లోటు వుందని నిశ్చయించుకుంటూవచ్చాను. సరస! నువ్వెంత పని అయినా చెయ్యగలవు. నీతో నా కెంతమాత్రంపొసగదు. ఈ గుట్టు మనసార నిన్ను ప్రేమిస్తూవున్న నాదగ్గఱ దాచేవెందుకు?

సరస:—అమ్మ చెప్పవద్దంది.

కమల్:—ఈ నింద బాసేదెట్లా?

సరస:—నేను తొలగించుతాను. విషంత్రాగి నేను చస్తే మీ కీ నింద బాసిపోతుంది.

కమల్:—నువ్వు విషం త్రాగగలవా?

సరస:—ఆ, నిర్భయంగా మీకోసం త్రాగగలను. విషం త్రాగిన తర్వాత లోకులు మిమ్మల్ని బాధించకుండా, పోలీసులు బాధించకుండా వుండేటట్లు నా స్వదస్తూరీతో

నన్ను నేను స్వేచ్ఛతో చంపుకున్నానని వుత్తరం వ్రాసి చేవ్రాలు చేసి నా దిండుక్రింద వుంచి మరీ చస్తాను.

కమల్:—బలే, సరస! నీ ధైర్యం మెచ్చుకో తగ్గది. గదిలోనికి పోయి తలుపులు మూసికొని పని ప్రారంభించు. ఇవాళ నా మొగంవైపు అంత తీవ్రంగా చూస్తున్నావేం?

సరస:—ఇన్నాళ్లూ నాజీవితంలోగల రహస్యం దాచుకోవాలని మొగమెత్తి చూసేదాన్నికాను. ఇపుడు నారహస్యం బయల్పడింది. పైగా నాకు మీకు నేటితో సంబంధం తెగి పోతూవుంది. ధైర్యంగా చూడగలుగుతున్నాను.

కమల్:—సరే, పోతున్నాను.

సరస భర్త పాదద్వయాన్ని రెండు చేతులతో ముట్టుకుని చేతులు కళ్లకి అద్దుకుంది. కమల్ మేడదిగి క్రిందికి వస్తున్నాడు. మెట్లమీద తన చిన్ననాటి స్నేహితుడు దుర్గారావు చీట్లపేకముక్కలు పట్టుకుని తనలోతానే మాట్లాడుకుంటూ ఆడుతున్నాడు. కమల్ తన్నుతాను మరిచిపోయి తన స్నేహితుణ్ణి తన్నుకుని దిగిపోతూ వున్నాడు.

దుర్గా:—అన్నయ్యా! ఇది ధర్మంకాదు సుమా.

నిర్ఘాంతపోయాడు కమలుడు. "ఏంవిరా, ఇక్కడెందు కున్నావు" అని స్నేహితుణ్ణి అడిగాడు.

దుర్గా:—వదినెను విషం త్రాగమని చెప్పి నువ్వు సుఖంగా వుంటావా?

కమల్:—దుర్గారావు, పూనానుంచి ఎప్పుడువచ్చావు? ఈ విషయం నీ కెట్లా తెలుసు?

దుర్గా:—అన్నీ విన్నాను. గోడలకి చెవులుంటాయని తెలీదునీకు? ఎవళ్లో పిచ్చిపిచ్చి సనాతనులు ఏమేమో ప్రేలుతూ వున్నారని వాళ్లమాటలు పట్టింపుచేస్తావా? వదినె అగ్ని హోత్రం సుమా! ఆవిడని వుసురుపెట్టకు.

కమల్:—అది వేశ్యకూతురని వాళ్లంతా రుజువుచేస్తా రట. మనం కొద్దిగానో గొప్పగానో పెద్దల్ని గౌరవించాలి. మా నాన్నగారుకూడా పూజాపునస్కారాలు భక్తి శ్రద్ధ అన్నీ పాటించేవారు కాని ప్రస్తుతపు బ్రాహ్మణులవంటి పిచ్చి పిచ్చి చేష్ట లుండేవికావు. ఆతడే బ్రతికివుంటే నాకీ పాట్లు రావురా భాయ్! నువ్వు కేవలం అమాయకుడవు. లోకంతో నీకు అనుభవం చాలా తక్కువ.

దుర్గా:—వేశ్యకూతురుగాని వేశ్య కాదుగా? ఎంతటి అమాయకుణ్ణి అయినా ఈ నీవిషయంలో మాత్రం తప్పునీదని గట్టిగా వాదిస్తాను. మా వదినె ప్రాణాలు మాత్రం తీయవద్దు. మన గోపాలరావుపంతులుగారి కుమార్తె వెంకునాయుడు కొడుకుని కలకత్తాలో పెళ్లాడింది. వాడు బాగా చదువు కున్నాడు. పవిత్రమైన ఆచరణగలవాడు. పెద్దవుద్యోగం చేస్తు న్నాడు. సంఘం పంతులుగారి కూతుర్ని బహిష్కరించింది.

వాళ్లకేం తక్కువా? నా పెళ్లికూడా కలకత్తాలోనే చేసుకుంటాను.

స్నేహితు లిద్దరూ చర్చించుకుంటూ బయటికి షికారు వెళ్లారు. ఆరాత్రి కమలు డింటికివచ్చి సరస గది తలుపు తట్టి లోపల ప్రవేశించాడు—సరస తెంపు లేకుండా కన్నీరు కారుస్తూ వుంది. కమలుడుకూడా ఎంతప్రయత్నించినా ఆగని ఆవేగం కన్నీటిమూలంగా కనబరుస్తూ సంఘాన్ని సంతోషపెట్టాలనే దృఢసంకల్పంతో, "నీ మాట నిలబెట్టుకోలేక పోయావేం?" అన్నాడు.

సరస నోటంట మాట రాకుండా వుంది. జవాబు చెప్పకపోతే భర్తమనసు నొవ్వకమానదు. వెక్కుతూ, "నాథా! నన్ను పెళ్లాడటంవలన మీకు కల్గుతూవున్న బాధలా అపరిమితములు. మిమ్మల్ని సుఖపెట్టి మీమనసునకు శాంతికూర్చాలని వుంది. ఈ నాశరీరం నామనసు, నాఆత్మ, అన్నీ మీస్వాధీనాలు. నాచావునకు నేను భయపడను. నాగర్భంలో వున్న శిశువును చూస్తూ చూస్తూ చంపలేను" అని పరుపుమీద బోర్లపడి దిండును తడిపింది కన్నీటితో. సరిగా అదే సమయానికి దుర్గారావు ప్రత్యక్షమైనాడు. దుర్గారావుని చూసి కమలుడు నివ్వెరపోయాడు—"సోదర!" అన్నాడంతే. దుర్గారావు కంట తడిపెట్టుకుని, "అన్నయ్యా! సరస కనురెప్పల

చివరను మత్యాల్లాగున నీటిబిందవులు తళతళ మెరుస్తు న్నాయి. ఏడుస్తూవున్నా ఆమె మొగం రంభని ధిక్కరించుతూ వుంది. ఆ శరీరఛాయ వెయ్యిమందిలో ఒక్క ఆడదానికి లేదు నేను చూచినంతవరకూ. ఆమె గర్భంలో వున్న శిశువు ఎంత అందంగావుండాలో ఆలోచించు. తల్లిచేసినతప్పునకు కూతుర్ని శిక్షించడం అసలు అన్యాయం. మన సంఘానికి నీతి లేదు. అర్థంలేని నియమాలు మనవాళ్ళవి. రాజులయిళ్లల్లో అనుమా నాలపైన ఈలాటివే భ్రూణహత్యా విశేషాలు జరుగుతూ వుం టాయి. ధనవంతులలో ఇది ఆచారమైపోయింది. ఎవడా కుల పెద్ద, ఏదీ, చూపెట్టు, రెండుముక్కలుగా తెగగొట్తాను. మీ పింతండ్రి అయితే చెప్పు వాడ్ని ఒకచూపు చూస్తాను" అంటూ కోపావేశాన దుర్గారావు ఒక్కదాటు వేశాడు అవతలకి. కమలుడు సరసని దగ్గరగా చేర్చుకున్నాడు. చెక్కిళ్లు తన మునివేళ్లతో నిమురుతూ, "సరస! ఎంతమాత్రం భ్రూణహత్య చేయకు" అని బయటకు నడిచాడు.

** ** **

## ౭

సరస ఒకనాడు భర్తచేయి అదిమిపట్టుకుని, "నాఅదృష్టం నిజంగా మెచ్చుకోతగ్గది. మీరు నన్నింతవరకూ కరుణించి నామనస్సుని తృప్తిపరిచారు. ఇటుపైన నాజీవితం ఎలా గడు

స్తుందో మీరు చింతించవని లేదు; కాని ఈ నాయిల్లూ వాకిలీ సమస్తం అందంగా పొందుపరిచారు గనుక నేను మిమ్మల్ని విడిచి వెళ్లినా ఇంకో స్త్రీని పెళ్లాడి ఈ యింటిని ముచ్చటగా చూసుకోమని చెప్పండి ఆయనతో. ముందుముందు ఎన్నికష్టాలో నేననుభవింపవలసివుంది. అనుభవించటానికి సిద్ధంగావున్నాను. మీ రెంతమాత్రం నాకోసం నిరుత్సాహంగాని చింతగాని పడ వలసిన పని లేదు" అంది ధైర్యంగా.

కమల్ ఏమీ అనలేకపోయాడు. ప్రత్యుత్తరం ఏమి ఇవ్వాలో అతనికి తోచనేలేదు. ఇంతగట్టిగా సరస తనయెదుట ఎన్నడూ మాట్లాడలేదు అదే అతని ఆశ్చర్యానికి కారణం. పైగా ఆమెమాటలు ఎట్లాటి భర్తఅయినా ప్రత్యుత్తరం చెప్ప తగ్గవి కావుగా! ఇంతవరకూ తన జీవితానికి సంబంధించిన నిజాన్ని బయటపెట్టకుండా వుండాలని ఆమె బాహాటంగా, స్ఫుటంగా పెనిమిటితో మాట్లాడేదికాదు. ఇప్పుడు తన చరి త్రకు సంబంధించిన విషయం బయల్పడింది. ఇంకా భయ మెందుకు? కాబట్టి తాను తన సర్వస్వమని తలుచుకుంటూ వున్న పెనిమిటినే విడిచిపోతూవుండగా గట్టిగామాట్లాడ్డానికి భయపడ నవసరంలేదని నిశ్చయించుకుంది. భర్తకు ఇల్లూ వాకిలీ అప్ప గించింది. అతని పాదాలు కడిగింది. నీళ్లు నోట పోసుకుంది. కమల్ అక్కడ నిలబడలేకపోయాడు. అతని గుండెల్లో ఏదో

బరువైన వస్తువు ప్రవేశించినట్లు అతనికి తోచింది. ఆచోటు విడిచి రివ్వున అవతలకు పోయాడు కమల్. సరస కొయ్యబొమ్మవలె నిల్చుంది కొంతసేపు. భద్రకాళి ఆమెను సమీపించి, "కోడలా! ఈ పత్రంమీద సంతకంపెట్టూ!" అని అధికార పూర్వకంగా ఆజ్ఞాపించింది. అంతలో దుర్గారావు వచ్చిపడ్డాడు—"వదినా! వద్దు. ఎంతమాత్రం సంతకం పెట్టవద్దు" అంటూ భద్రకాళితో, "మా అన్నయ్య మతిచెడి మాట్లాడకుండా వున్నాడని నీయిష్టంవచ్చినట్లు అధికారం చలాయిస్తున్నావా? ఆమె అన్నీ విడిచిపెట్టి పోతూవున్న సన్యాసినిగదా, సంతకమెందుకూ ఏడవను? పో, సంతకమూలేదూ గింతకమూ లేదూ!" అని గద్దించాడు.

భద్రకాళి దుర్గారావు మాటలకి భయపడింది. బెదురు చూపులతో అతణ్ణి చూస్తూ, "సరస! మీమరది కోప్పడుతున్నాడు. పోతానులే" అని పోబోతూవుంది. సరస భద్రకాళి చెయ్యిపట్టికొని కాగితం లాక్కుంది. దానిమీద స్వహస్తాక్షరాలతో సంతకంచేసింది. స్పష్టంగా సంతకంచేసింది. కనిపించీ కనుపించని సన్నని నవ్వు భద్రకాళి పెదవులమీద తాండవించింది. ఆమె తనపని పూర్తికాగా గబగబ మేడమెట్లు దిగిపోయింది. ఆమె దిగడమేమిటి, గుఱ్ఱపుబండి వాకిట నిలవడమేమిటి, రెండూ వక్కపర్యాయం తటస్థించాయి. జోడుగుఱ్ఱాల మెడలలోని ఘంటల క్విణక్విణ ధ్వని సరస చెవులబడగానే ఆమె

"సూటుకేసు" చేతపట్టుకుని క్రిందికి దిగింది. మెట్లు దిగువను కమల్ కనిపించాడు. కమల్ దగ్గఱ కాస్సేపాగి, "ఇదిగో ప్లో రెండే రెండుగుడ్డలు. నన్ను ఆపాదమస్తకంచూడండి. ఆభరణా లన్నీ మేడపైని నాగదిలో పెద్దట్రంకులో పెట్టి వుంచాను. రాబోయే గృహిణిని వాటితో అలంకరించండి" అంటూ అవత లకు వక్కదాటు వేసింది. బండివాడు, వానిప్రక్కనే విద్యార్థి దుస్తులతో ఇంకో కుర్రవాడు కూర్చున్నారు. బండిలో సరస అడుగుపెట్టినదే తడవు గుఱ్ఱాలజంట గాలిలో యెగిరిపోయింది.

* * *

కమల్ పినతండ్రిదగ్గరకి సుబ్బావధాని వచ్చాడు. అది మధ్యాహ్నసమయం. భోజనానంతరం కమల్ పినతండ్రి వీధి అరుగుమీద కూర్చుని చుట్ట కాల్చుకుంటున్నాడు. సుబ్బావ ధాని అతణ్ణి సమీపించి, "కమల్ పింతండ్రి యెవరండీ?" అని ప్రశ్నించాడు. కమల్ పింతండ్రి ఎన్నో ప్రశ్నలువేసి సుబ్బావ ధాని రాకకు కారణ మడిగి, ప్రత్యుత్తరం వచ్చిన తరువాత సరస తల్లి దోషి అయితే సరసను నిష్కారణంగా దుఃఖపెట్టడ మెందుకని సుబ్బావధాని కెంత బోధపరిచినా అతడు వినలేదు. అతనికి డబ్బుప్రధానం. సుబ్బావధానిచూపిన కొన్ని ఉత్తరాల వలన సులోచన కులభ్రష్ట అని స్పష్టంగా ఋజువైంది. ఇక తన పేరు కూడా సాటిబ్రాహ్మణ్యంలో చాటుతాడేమో అనే భీతి

చాత కమల్ పినతండ్రి తన గుమాస్తాతో ఏవేవో ఆలోచనలు చేసి, "సుబ్బావధానీ! ఇదిగో రెండు నోట్లు. ఒక్కొకటి వెయ్యిరూపాయలది. ఇక్కడికి 20 మైళ్ల దూరంలో రామచంద్రపురం అని వకపట్టణం వుంది. అక్కడికిపోయి ట్రెజరీలో ఈ నోట్లు మార్చుకో. తిరిగీ ఈ వూరిలో అడుగుపెట్టావా, ప్రాణాలతో బయటకి పోలేవుసుమా, పో!" అని వానిని తగిలేశాడు.

వేంకటావధాని యిల్లు క్రోశెడుదూరంలో వుండగానే కమల్ గుమాస్తా సరసతో అన్నాడు, "అమ్మా! రాత్రంతా రైలుప్రయాణం. ఇప్పుడు బండిప్రయాణం. నాకు చాలా ఆయాసంగావుంది తల్లీ. ఈ దారిని తిన్నగా అడుగుతూపోతే పురోహితునియిల్లు చేరుకుంటావు. శెలవిప్పించు" అని కన్నీరు కారుస్తూ గుమాస్తా మాయమైనాడు. సరస గంటసేపు నడిచి కనబడినవాళ్ల నందరినీ అడుగుతూ అవధానిగారింటిని సమీపించింది. తన చిన్ననాటి పరిచితమైనస్థలం కాబట్టి నట్టింటికిపోయి నిల్చుంది. వేంకటావధానిగారు పెరట్లోనుంచి వచ్చారు. సరస నమస్కరించింది. అవధానిగారి మొగాన జాలి చిన్నెలు కనబడ లేదు.

"ఎందుకొచ్చావు? మీఅమ్మ ఎక్కడకోపారిపోయింది. ఎవరి నెత్తుకునిపోయిందో తెలీదు. నా బ్రతుక్కి నీళ్లు పోసి

పోయింది. వున్న కాస్త జాతీ నువ్వు పోగొట్టాలని వచ్చావా? నీకిక్కడ ఒక్కక్షణంకూడా ఆశ్రయంఇవ్వను, పో!" అన్నాడు.

ఒక్క రాత్రికి ఆశ్రయంయిస్తే చాలునని యెంతో బ్రతిమాలింది సరస. తల్లి వుంటుందికదా అనుకుంది. ఇంకొకరెవ్వరూ ఆశ్రయమివ్వరు. ఎక్కడా ఆశ్రయంలేకపోతే గంగానదిలో దూక్కుందాం అనుకుంది. గర్భంలో శిశువునుంచుకుని ఘోరమైన పని యేదీ చేసుకోలేను. మతిపోయి ఏకధారగా కన్నీరుకారుస్తూ నిలబడిపోయింది;—

"మర్యాదగాపోతావా? గెంటించమన్నావా?" అన్నాడవధాని.

అవధాని పింతండ్రి తన చేతిలోగల చదరంగపుబల్లతో లోపలకివచ్చాడు పొరుగింటినుండి. ఆదరంతో సరసను సంబోధించి, "అమ్మా! నాకింత గంజిపోసి, నువ్వింత త్రాగుదువు గాని రా; నేను పురోహితుణ్ణిగాను. ఒకరిపోషణక్రింద లేను. నాకు జాతిపోయినా భయంలేదు. లే, నడువు!" అని చెక్కపట్టుకుని ఆమెను లేవనెత్తాడు. సరస లోలోపల ఎంతో సంతోషిస్తూ ఆ ముసలిబ్రాహ్మడి పంచ చేరుకుంది. అవధాని పింతండ్రి ఆమెకు చోటివ్వకపోతే ఆమె సౌందర్యం—ఆమె శిశువు—ఆమె జీవితంతో నాశమయ్యేవే. పాపం! ఈ చిన్నతనంలోనే ఇంతటి అందకత్తె, ఇంతటి నిష్కల్మషహృదయ,

కష్టం—సుఖం అన్నీ అనుభవించింది. ఆమె ముందు జీవితం ఎట్లా వుంటుందో మనం చెప్పలేం!!!

** ** **

౮

అవధాని పినతండ్రికి ఒక్కడే కొడుకు. వాణ్ణి చదివించి పెద్ద వుద్యోగస్థునిగా చేదామని వుండేది ఆ వృద్ధుడికి. పాపం, ఇరవై యేళ్ల కొడుకూ మూనాళ్లు జ్వరంతో బాధపడి తండ్రికి తీరని దుఃఖం పెట్టిపోయాడు. నాటినుండి అవధాని చదరంగం ప్రారంభించి తన దుఃఖాన్ని మరిచిపోయాడు; ఇప్పుడు సరసకి ఆశ్రయం ఇచ్చి తిరిగీ సంసార తాపత్రయంలో పడ్డాడు. ఇంట్లో వండిపెట్టిందికి సరసవుంది. ఇప్పుడు తాను కాశీలోనే వుంటు న్నాడు కాబట్టేన్నీ తీరిక వుంది కాబట్టేన్నీ నిత్యం వుదయానే మణి కర్ణికాఘాటున స్నానంచేస్తూ విశ్వేశ్వరుని ఆలయంలోకిపోయి పరంకోసం పన్నెండు ఘంటల వరకూ జపంచేసుకుని ఇంటికి వస్తాడు. మధ్యాహ్నం వూళ్లోవున్న పింఛనుదారులతో చద రంగం ఆటలో కాలం గడుపుతాడు.

సరస బయలుదేరిననాడు, కమల్ కూడా గుమాస్తాగారికి యిల్లూ వాకిలి అప్పగించి దేశాటనానికి బయలుదేరాడు. అతడు బయలుదేరిన మర్నాడే సుబ్బావధాని కమల్ పినతండ్రి దగ్గరకి రావటం రెండు వెయ్యిరూపాయల నోట్లు తీసుకుని

వెళ్లడం తటస్థించింది. నోట్లిచ్చి సుబ్బావధానిని పంపేసిన తరువాత కమల్ పినతండ్రి తన గుమాస్తాను పిలిచి, "ఈ ఛండాలుడు ఈ వూరు వదలిపొయ్యేటట్లు కనబడదు. ఏదైనా వుపాయం ఆలోచించు. లేదా చీటికీ మాటికీ మనమీద పడగలడు సుమా!" అని హెచ్చరించాడు. గుమాస్తా పొట్టివాడేమో, వాని ఆలోచనలకు లోటులేదు. వెంటనే దుర్గారావుని సమీపించి అతని చెవిలో వూదేశాడీవిషయం. దుర్గారావు తన సైకిలెక్కి సుబ్బావధాని త్రోవలో వుండగానే రామచంద్రపురం చేరుకున్నాడు. ట్రెజరీకిపోయి షరాబుగారిని సమీపించి అతి వినయంతో నమస్కరించి, కమల్ పింతండ్రి స్వదస్తూరీతో వ్రాసి యిచ్చిన రిపోర్టు షరాబునకిచ్చాడు. షరాబు అది అందుకుని నవ్వుకుంటూ "తమరు వెళ్లవచ్చును" అన్నాడు దుర్గారావుతో. దుర్గారావు తిరుగుదలలో సుబ్బావధానిని పట్టణ పరిసరప్రాంతంలో వక చెట్టుక్రింద విశ్రాంతితీసుకుంటూవుండడం చూశాడు. ఇల్లు చేరుకున్నాడు దుర్గారావు. వూళ్లోకి పెద్ద కోనేటిగట్టుమీదుగా రావాలి. నీళ్లకి వచ్చిన ఆడవాళ్లు—

"ప్రేమ పెళ్లి యీడుది. మొన్ననే మగ పెళ్లివారు వచ్చారు. అంతానిశ్చయించుకుని వెళ్లారు. ఈపిల్లపెళ్లి ఎంతో వైభవంగా చేదా మనుకున్నాడు రామ్మూర్తి పంతులు. ఆంధ్రం, అమరం, ఇంగ్లీషు, హిందీ అన్నీ చదివించాడు. దానికి పొయ్యేకాలంవచ్చింది. కాకపోతే పారిపోతుందా" అని వకర్తె—

లేచిపోయినా బ్రాహ్మడితో లేచివచ్చిందిట సులోచన. దాన్ని ఎక్కడా నిలిపేరుకారు ఈపెద్దలంతా. ఇప్పుడు ఏతురకాడితో పారిపోయిందో కుగ్రది" అని వకర్తె—

"ఈయుగంలో కూడా జాతీ నీతీ అంటారేమిటో, సర్వం జగన్నాథం—" అంది ఒకర్తె—

దుర్గారావు అతిశ్రద్ధగా వింటున్నాడు. నెమ్మదిగా సైకిలుత్రొక్కుతూ రామ్మూర్తిపంతులుగారి యిల్లుచేరి అతని గుమాస్తాతో తనపని నెరవేర్చుకున్నట్లుచెప్పి, "నేను బెజవాడ వెళ్తాను. నాకు వందరూపాయలు అప్పుకావాలి" అని అడిగాడు. దుర్గారావు, కమల్ పినతండ్రి అయిన రామ్మూర్తి పంతులుతో మాట్లాడ్డు. కమలుణ్ణి ఇంతవరకూ బాధించినవాడు రామ్మూర్తిగారే కాబట్టి దుర్గారావుకి అతడంటే పూరంత కోపం, అసహ్యమూను. దుర్గారావు కమల్ గుమాస్తా అయిన గోపాలరావునాయుడు కొడుకు. కమల్ తండ్రి దుర్గారావుని కూడా కమల్‌తో సమానంగా చదివించాడు. దుర్గారావు కమలుణ్ణి ప్రాణంతో సమానంగా చూస్తాడు. అట్లాంటి స్నేహం లోకంలో అరుదనే చెప్పాలి. రామ్మూర్తిపంతులు తనకూతురు ప్రేమవతి పారిపోయిన నాటనుండి మంచం నేస్తున్నాడు. అతనికి, తనవలన సరసకీ కమలునికీ కలిగిన బాధలు ఒక్కొక్కటీ ఒక్కొక్క భూతంలాగున కనబడుతున్నాయి.

ఈ స్థితిలో ఎవరేది కావాలని అడిగినా యాచించకుండా వున్న వాళ్లదే పాపం. దుర్గారావు కోరిక నెరవేరింది. అతను బెజవాడ ప్రయాణమై పోయాడు. గోపాలరావునాయుడు నెత్తీ నోరూ ఎంతకొట్టుకుంటూ బోధించినా దుర్గారావు ఇంటిపట్టున పట్టుమని పదిరోజులుండేడు. ముసలితలిదండ్రులకి, అందులో ఇంతో అంతో కాలక్షేపానికి లోటులేనివాళ్లకి కావలసిందేమిటి? బెజవాడ వెళ్తూవున్న సమయంలో తండ్రి, "నాయనా! నువ్వు దేశాటనం మాని ఇల్లు కనిపెట్టుకునివుంటే, మల్లికార్జునరావు నాయుడుగారి కూతుర్ని ఇస్తామంటున్నారు. వాళ్లు లక్షాధికార్లు. నువ్వు అక్కడా అక్కడా తిరిగి ఆర్జించి మాకు పెట్టనక్కరలేదు. పంతులుగారి ధర్మమా అని మా కంఠంలో ప్రాణాలువున్నంతవరకూ మనజీవితానికి లోటులేదు. నామాట తిరస్కరింపకు" అని బ్రతిమాలుకున్నాడు. దుర్గారావు— "నాన్నగారూ! తిరుగుతే జ్ఞానం సంపాదించవచ్చును" అని మాత్రం జవాబుచెప్పి వెళ్లిపోయాడు.

* * *

సుబ్బావధాని చచ్చీ చెడీ రామచంద్రపురం చేరుకున్నాడు. ట్రెజరీనిచేరి షరాబుగారికి నమస్కరించాడు. షరాబు అవధాని చేతినుండి నోట్లు అందుకుని తన జేబులోనుండి ఒక కాగితం పైకితీసి నోట్లుతో తన కాగితంపైన వున్న నెంబర్లు సరి చూశాడు. సమీపంలోవున్న పోలీసు కానిస్టబిలును గొంతెత్తి

పిలిచి, "ఇతణ్ణి ఠాణాకి తీసుకునిపో. ఇదిగో రామ్మూర్తిపం తులుగా రిచ్చిన రిపోర్టు" పోలీసువారు సుబ్బావధానిని రిమాం డులో పెట్టారు. కేసు నడిచింది. విచారణలో సుబ్బావధాని మనివిచేసుకున్న దేమంటారా, "ప్రభువువారు న్యాయంగా విచారించాలి. ఈరెండునోట్లున్నూ రామ్మూర్తిపంతులుగారు తనచేతులతో తానే నాకిచ్చారు. నేను వారింట్లోనుండి దొంగ లాడలేదు" కేసంతావిచారించి సుబ్బావధానిచరిత్రను భోగట్టా చేసిన తర్వాత న్యాయాధికారి అతనికి రెండేళ్లు కఠినశిక్ష విధిం చాడు. ఇక సుబ్బావధాని ఎవరి పరువు తియ్యడానికేనా ఇంత వేగం ఇవతలకి రాకుండాపోయాడు. తన నిత్యజీవితానికి అక్క డక్కడ తిరిగి శ్రమపడవలసిన అవసరం అతనికి లేదిప్పుడు. సులోచన ఎవరికంటా పడకుండా తన దుఃఖభారాన్ని తానే మోసుకుని ఎక్కడకో పోవడానికి కారణం ఈ సుబ్బావధాని. తన స్వార్థంకోసం సరసని—హాయిగా అన్నిసుఖాలూ అనుభ విస్తూ వున్న సరసని భర్తనుండి ఎడబర్చినవాడు ఈ సుబ్బావ ధాని. తండ్రి చావు తరువాత మనస్సుకి శాంతి లేకపోగా దేశాటనం చేసి, మహా యాగాలుచేసి రంభని సంపాదించు సోమయాజివలె రంభవంటిదే అయిన సరసను పత్నిగా సంపా దించి సుఖమయమైన జీవితం వెళ్లపుచ్చుతూవున్న కమలనాభుని కంగారునకు కారణం ఈ సుబ్బావధాని. వాడిప్పుడు మనుష్య సంఘానికి అడ్డుతగిలి సజ్జనుల్ని ఇక బాధించడు కొన్నాళ్లవరకు.

*  *  *

గోపాల్ రావునాయుడు ఉత్తరం చదువుతున్నాడు. అది కమల్ వ్రాసినది.

"సరస తల్లినిచేరుకుందని వూహిస్తాను. నువ్వు కాశీలో ఆమెను అవధానిగారికి అప్పగించి వుంటావు. వారు నీతో యేమన్నారు? నీ ప్రత్యుత్తరంలో నాకు తెలియచేయాలి. సరసకి నెలకు ఏమాత్రండబ్బు పంపుతూవున్నావో అదికూడా తెలియచేయవలెను. అన్నిపనులు మరిచిపోయినా ఈ పని మాత్రం మరిచిపోవద్దు. మామేనత్తమాట లెంతమాత్రం విన వద్దు. స్త్రీలు చపలలంటారు. వారి మనస్సు చంచలిస్తూ వుం టుంది. దుర్గారావుతో నేనున్నచోటు చెప్పవద్దు. వా డెక్క డున్నదీ ఏలాగున్నదీ తెలియచేయవలెను.

నీక్షేమాభిలాషి,

క మ ల నా భు డు"

ఉత్తరం చెన్నపట్టణంనుండి వచ్చింది. నాయుడుగారు ఆ వుత్తరం భద్రకాళికి చదివి వినిపించారు. ఇల్లూ వాకిలీ అన్నీవిడిచిపెట్టుకుని, మొగుడు ఆ స్త్రీకి తానెంతమాత్రం హక్కు దారురాలు కానట్లు పత్రంమీద సంతకం పెట్టిందికదా దానికి డబ్బు పంపించడ మెందుకని భద్రకాళి వాదించింది. భద్రకాళికి భయపడి నాయుడుగారు డబ్బు పంపనేలేదు. కాని కమలుడు పోటనం వెళ్లినపుడే సరసికి ధనం సహాయం చేస్తూ వుండ

వలసిందని గుమాస్తాగారిని ఆజ్ఞాపించి వెళ్ళాడు. భర్తవలన కించిత్తేనా సహాయం పొందటానికి సరస యిష్టపడకపోయినా ఒకనాడు కోరికోరనట్లు రెండు వందల రూపాయలు ఆమెకు మనియార్డరుద్వారా వచ్చాయి. మనియార్డరు చేయకముందు గోపాలరావునాయుడుగారు కమలుడు వ్రాసిన ఉత్తరం మంచం నేస్తూవున్న రామ్మూర్తిపంతులుగారికి చదివి వినిపించాడు. అతడు క్షీణస్వరంతో "నాయన! తప్పకుండా సరసకు డబ్బు పంపించు. నాలో తప్పులుండగా సరసని నిష్కారణంగా ఏడ్పించాను. ఆపాపం నన్నివిధంగా వేధిస్తూవుంది. ఎన్నడూ ఏదాంపత్యాన్నీ ఎవ్వరూ నాశం చెయ్యకూడదు. జాతి, మతం పేరుతో అర్థంలేని లాంఛనాలు సంఘంలో చొరబెట్టి యువతీ యువకుల్ని నాశంచెయ్యడం ఘోరపాపం. మానవజాతికి నీతి ప్రధానమైనది. నీతిలేని ఆచారా లెన్నివున్నా లాభంలేదు. నా కమలుడు మళ్లీ సరసతో నా కెప్పుడుకనబడతాడో తెలీదు. మా ప్రేమ మళ్లీ యేనాడు నాకంటపడుతుందో తెలీదు. నేను చావకముందు వాళ్లని నాకంటపెట్టడానికి ప్రయత్నించు. డబ్బు త్వరలో పంపు" అని ఆజ్ఞాపించాడు. అతని కళ్లవెంబడి నీటి వరద ప్రవహిస్తూవుంది. గోపాలరావు తన జేబురుమాలుతో పంతులుగారి కన్నీరు వొత్తి—

"బాబూ! మీఅన్నయ్యగారి పంచనిచేరి నేనొకయింటి వాడి నైనాను. ఆమూలంగా తమకుకూడా దాసుణ్ణి. తమరట్లా

దుఃఖిస్తే నాకు ఏపని చెయ్యటానికేనా సాహసం కుదరదు. తమ కోరిక తప్పకుండా నెరవేరుస్తాను" అని వోదార్చాడు. అంతలో భద్రకాళి తనభర్తతో సహా అక్కడికివచ్చి, "అన్నయ్యా! నీకుకూడా మతిపోయిందా యేమిటి? చెడిపోయినవాళ్లతో మనంకూడా చెడిపోవాలా? ఎంతమాత్రం ప్రేమని ఇంటికి రానివ్వకు. సరసకి డబ్బు పంపకు" అంది గంభీరంగా

రామ్మూర్తిపంతులు అంత బలహీనస్థితిలోనూ, కోపావేశం చాత లేచికూర్చున్నాడు. సంధించినవానివలె రెండుచేతులతో జుట్టుపీక్కుంటూ పళ్లు పట పట కొరుకుతూ, "ఛండాలపు ముండా! నీవంటిది ఒకొక్క కొంప చేరితే ఆకొంప నాశమవుతుంది కాని ఎత్తిరిల్లుతుందా? మీయిద్దరికీ జాతిపోతే ఇంకో పంచకి పొండి. పరస ఇంట్లో కాలుపెట్టిందే మొదలు రవరవ మండిపోతున్నావు. గొడ్డుదానివికదా, నీకు ఆస్తి పాస్తి యెందుకే? నిన్నూ నీమొగుణ్ణి కప్పి కాల్చినంత ఐశ్వర్యం వుంది మనకి. రెండు కొంపలకీ ఒక్కడే వారసుడు. నాఅన్న దినాలెట్లాగడిచేయో నాదినంకూడా అట్లాగే కమల్ చేతులమీద గడుస్తే నీకు చూడాలని లేదుకాబోలు? ఇష్టంలేకపోతే కళ్లు కట్టుకో. వకరిపోషణలో మనంలేముకదా! జాతి పోతేపోనీ, సర్వేశ్వరుడు అందరికీ వక్కడే. వాడికి లేని జాతి నీకు నాకు [illegible]?" అని గర్జించి నీరసించి సొమ్మసిల్లి దబ్బున పడ్డాడు మంచంమీద.

అతని ప్రాణాలు పోయాయనుకున్నాడు భద్రకాళీభర్త. భయంచాత గజగజ లాడిపోయాడు. గోపాలరావుతో సహా బావగారికి శీతలోపచారాలు చేశాడు. పంతులుగారికి స్పృహ రాగానే మెల్లిగా అతని కనురెప్పలు విడ్డాయి. భద్రకాళీభర్త చేతులు జోడించి నిల్చుండి, "బావ! క్షమించాలి. అది వట్టి మూర్ఖరాలు. మీఆజ్ఞకి బద్ధుణ్ణి నేను" అని ప్రార్థించాడు. రామ్మూర్తిపంతులు బావని క్షమించాడు.

** ** **

౬

వెంకటావధాని పింతండ్రియిల్లు చూడ శక్యంకాని వైభవంతో వుంది. ఆ ముసలివాని ఆనందాని కిప్పుడు మేరలేదు. ఇంట్లో మగశిశువు తప్పటడుగులు వేస్తూ అతని చదరంగపు బిళ్లల్ని ఎత్తుకునిపోతూ ఇల్లంతా తానే అన్నట్లు ప్రాకుతూ నడుస్తూపడిపోతూవుంటే సరసచూచి సంతోషం పట్టలేకుండా వుంది. కొడుకుని మరిచిపోయాడు వృద్ధబ్రాహ్మణుడు. కాశీ విశ్వేశ్వరుని కరుణచాత పుట్టినాడుకాబట్టి ఆ శిశువునికి విశ్వేశ్వరావు అని నామకరణం చేశాడు వృద్ధుడు. సరస అత్తణ్ణి, "నాన్న" అని పిలుస్తుంది. ఆమె కొడుకు మాటలు అలవడగానే, "తాత" అనడం మొదలుపెట్టాడు. కొన్నాళ్లు పోయిన తర్వాత సరసకి చిన్నదుఃఖంకలిగింది. ఈ సంతోషసమయంలో

తన భర్త వస్తే బాగుండేది అని అనుకుంటూ వుండేది. ఆమె విచారాన్ని తొలగించాలని వృద్ధు డెన్నోప్రయత్నాలు చేసే వాడు. బాగా నడక నేర్చుకున్నాడు విశ్వేశ్వరుడు. తాతగారితో చదరంగం ఆటకి ఇరుగింటికీ పొరుగింటికీ బయలుదేర్తాడు. ఆటలో తాతకి యెత్తులు నేర్పుతాడు. "గుల్లం నాది" అంటాడు. ఇన్నాళ్లూ ఆ వృద్ధుణ్ణి ఆటలో యెవరూ గెల్చుకోలేక పోయారు. ఇప్పు డతని ధ్యానం విశ్వేశ్వరుడిమీద వుండడం చాత ఆటలో తరచు ఓటమికూడా పొందుతున్నాడు.

సరసకి ఆశ్రయంఇచ్చిననాటనుండి అవధాని తనపితంండ్రి యింట అడుగుపెట్టడంమానీశాడు. ఒకనాడు అవధాని పూజా పునస్కారాల్లో నిమగ్నుడై వుండగా ఎవరో [illegible] అతని వాకిటకువచ్చి తలుపుతట్టారు. దాసి[illegible] తలుపు తెరిచి [illegible] గారినిచూసి భయంచాతనో సిగ్గుచాతనో, మర్యాదచూపుదా మనో తలుపుచాటున నిలబడింది,—"ఈ యింట్లో ఒక స్త్రీ, చంటిబిడ్డడూ వుండాలి" అన్నాడు కమలుడు. ఎవ్వరూ లేరని ఆదాసి ప్రత్యుత్తరంఇచ్చింది. కమలుని ధైర్యం సడలిపోయింది. అతడు గుమ్మంలోనే చతికిలబడి పోయాడు. దాసి లోపలికి పోయి యజమానితో చెప్పా లనుకుంది. అతడు పూజలో వున్నాడు. ఘంటసేపటికి పూజాదులు ముగించి అవధాని ఇవతలకి వచ్చాడు. కమలుణ్ణి చూసి నిశ్చేష్టు డైనాడు. "సరస వుందా?" అని ప్రశ్నించాడు కమలుడు.

లేదని తలవూపి, అవధాని అన్నాడుకదా, "పుస్తెకట్టిన వారు మీరే ఆమె కాశ్రయ మియ్యకపోతే పదిమంది పైన ఆధారపడివున్న నే నెట్లా ఈయగలను?" ఇక కమలుని మన స్సెట్లావుంటుందో వూహించండి. సరస ఆత్మహత్య చేసుకుంది. ఇది నిశ్చయం. ఈ యింట్లో సరసకు చోటులేనప్పుడు మరొక చోట ఆమె నివసింపదని కమలు డెరుగును,—"సులోచన ఎక్కడ?" అని మళ్లీ ప్రశ్నించాడు కమలుడు,—"నన్ను జాతి భ్రష్టుణ్ణిగా చేసింది. తా నెక్కడకో పోయింది!" అని బదులు చెప్పారు అవధానిగారు.

"సరసయేమైందో తమ రెరుగరా?" అని అడిగాడుకమల్.

"మా పింతండ్రిగారింట వుంది. వారిల్లు ఈ వీథిచివరనే వుంది"

"అతని వయ సెంత. ఆ యింట్లో ఇంకా ఎవరైనా వున్నారా?"

"అతని వయసు అరవై యేళ్లు. ఇంకెవ్వరూ అతనికి లేరు"

కమలుడు తిన్నగా అవధానిగారి పింతండ్రి యింటికి వెళ్లి వాకిట నిల్చున్నాడు. లోపలనుండి చక్కని పసిబాలు డొకడు వచ్చాడు. వాని చేతిలో ఒక వెండిగిన్నె నీటితో నిండివుంది. వాడు కొంచం కొంచం నీరు పుక్కిట్లోకి పీల్చి పిచ్చికారువలె పైకిచిమ్ముతూ నీటిలో తన తలపెట్టి తనప్రతిబింబాన్ని చూస్తూ

గంతులు వేస్తున్నాడు. కమలుడు కొన్ని నిముషాలవరకు వాని ఆట చూశాడు. అప్రయత్నంగా తానుకూడా గెంతి ఇటూ అటూ చూశాడు. తన్నెవ్వరైనా చూసి ఎగతాళిచేస్తారేమో అని భయపడ్డాడు. తుదకు సంతోషంపట్టలేక—ఆపసిబాలుణ్ణి చటాలున తన కౌగిట్లోకి లాక్కొని అదేపనిగా ముద్దులాడుతూ వుండగా లోపలినుండి దాసి చూసింది. గబ గబ పరుగెత్తి వంటయింట వున్న సరసని సమీపించి, "అమ్మా! ఎవరో దొరగారు మన వాకిట్లో నిల్చుని అబ్బాయి నెత్తుకుని ముద్దులాడుతున్నారమ్మా!" అంది. సరస నమ్మలేదు. ఎంతచెప్పినా నమ్మలేదు. దాసిని గసిరింది. వారే లోపలకి వస్తారులే అంది. కొంతసేపటికి కమలుడు చావడిలోకివచ్చి నిల్చున్నాడు. సరస క్రొత్తదనం చూపకుండా అతనికెదురుగా వచ్చింది. మునుపటి వలెనే వంగి అతనికాళ్లకి నమస్కరించి జోడు నంటివున్న ధూళి చేతులతో అద్దుకొని కళ్లకి రాసుకుంది,—"ఆకుర్చీమీద కూర్చోండి" అని కుర్చీచూపెట్టింది. కమలుడు సరస మొగంవైపు నిదానంగా చూస్తూ, "క్షేమంగా వున్నావా?" అని కన్నీరు కారుస్తున్నాడు. సరస తన పైటచెంగుతో ఆ కన్నీరు వొత్తి, వంగి భర్తగారి పాదరక్షల త్రాళ్లు మెల్లిగా విప్పింది—

"స్నానం చెయ్యండి. ఫలహారం తెస్తాను" అని దాసిని వేన్నీళ్లు సిద్ధంచెయ్యమంది.

"ఫలాహారంకాదు. భోజనం"

"నాచేత అన్నంతింటే మీజాతి పోతుంది. పైగా అన్నం చల్లారిపోయింది"

"చల్లారినదే వడ్డించు. జాతి పోయినా లక్ష్యంలేదు నాకు"

ఈ సంభాషణ ఇట్లా జరుగుతూవుంటే విశ్వేశ్వర్రావు పుక్కిట నీరు నింపుకుని పిచ్చకారుగా కమల్ మొగాన కొట్టి కిలకిల నవ్వుతూ గెంతులువేశాడు. సరస భయపడి అబ్బాయిని కోప్పడింది—

"అంతమాత్రానికే కోప్పడాలా? వాడుకూడా నాజాతి పోవాలని ఆపని చేశాడు. తల్లి నాజాతి పోగొట్టినందుకు సంఘం ఆమెని శిక్షించింది. వాణ్ణిఏమనిశిక్షిస్తుందీ?" అన్నాడు.

* * *

అవధాని పింతండ్రి వూళ్లో ఏదో పనిబడివెళ్లి యింటికి వచ్చాడు. కమలుడు ఆవృద్ధునికి నమస్కరించాడు. వుభయులూ కష్టసుఖాలు మాట్లాడుకుంటూవుంటే విశ్వేశ్వర్రావు వచ్చి వృద్ధుని కెదురుగా నిల్చుని తన చిన్ని చేతులు పైకెత్తి, "గుల్లం—తాతా! గుల్లం!!" అన్నాడు. వృద్ధుడు వానిని భుజాన్నెక్కించుకుని అటూయిటూ రెండుసార్లుత్రిప్పితే వాడు, "బలే, గుల్లంరా, చల్. చల్, ఉూఁ!" అంటూ కొన్ని నిముషాలు ఆనందించి దిగిపోయాడు. కమలుడు చిరునవ్వు నవ్వుతూ వృద్ధునితో—

"అయ్యా! తమరే ఈ మహానందానికి కారణం. తమ ఋణం

ఎట్లా తీర్చుకోవాలో తెలీదు. ఈ నా చిన్నకుటుంబాన్ని నాతో పంపటానికి అనుమతిస్తారా? దేశాటనం చేసి చేసి విసిగిపోయాను" అన్నాడు. వృద్ధుని నెత్తిమీద పిడుగు పడినట్లైంది. నిలబడ్డపాటున గుభాలున నేలకూలిపోయాడు. ఎన్నో శీతలోపచారాలు చేస్తేగాని అతనికి తెలివిరాలేదు. స్పృహ వచ్చాక కళ్ల వెంబడినీరు కారుస్తూ అన్నాడు,—"నాయన! అనుమతించిందికి నేనెవడను? పెంచినప్రాణం కాబట్టి మనసుండబట్టక యేడుస్తున్నాను. నా ప్రయోజకుడైన బిడ్డ పోయినతర్వాత ఈ చంటిపాప నాయింటికి ఎంతో శోభ తెచ్చిపెట్టాడు. మరిచిపోయిన సంసారాన్ని మళ్లీ ప్రారంభించాను. నువ్వు నీ కుటుంబాన్ని తీసుకుపోతే పచ్చని పైరుకోసినతర్వాత భూమిఎలాగుంటుందో ఆవిధంగా వుంటుంది నాయిల్లు. వద్దు మేయటానికి పశువులు రావు. పొలంకాపరి పని లేక ఉదాసీనంగా నిద్రపోతాడు. ఆశోభ మళ్లీవస్తుందా? నేను నాచదరంగంబల్లా విధిలేక వీధులంట తిరగవలసిందే. అదే నావిచారం" అన్నాడు. ఆపైన అతని నోట మాటరాలేదు. స్వరం సన్నగిలిపోయింది. తన గదిలో ప్రవేశించి చీకట్లో కూర్చున్నాడు.

సరస వృద్ధుణ్ణి భోజనానికి లెమ్మంది. విస్తరిదగ్గఱ కూర్చుని అప్రయత్నంగా భోజనం చేస్తున్నాడు బ్రాహ్మడు. ఒక్కొక్కకబళం నోటిదగ్గఱకివెళ్లి విషతుల్యంగా గోచరిస్తూంది అతనికి. అతడు ఉత్తరాపోసనం కన్నీటితోనే పట్టాడు. ఎంగిలి

చేయి కన్నీటితోనే కడుక్కున్నాడు. ఎంతని దుఃఖిస్తారెవరైనా? దుఃఖం మితిమీరితే నవ్వుక్రింద మారిపోతుంది. నవ్వుతూ ఆ వృద్ధుడు, "కూతురా! ఆకు వక్క ఇమ్మా!" అన్నాడు. వక్క మిగిలిన సుగంధద్రవ్యాలతో సహా చితుకగొట్టి ఆకుల్లో పెట్టి యిచ్చింది సరస. తాంబూలం నములుతూ విశ్రాంతి తీసుకుంటూన్న కమలుని మంచందగ్గఱకివెళ్లి వృద్ధుడన్నాడు— "నాయనా! మీ పింతండ్రి రామ్మూర్తిపంతులు జాతి అసలే పోయింది" అంటూ వెర్రివెర్రి నవ్వు నవ్వటం ప్రారంభించాడు. కమలు డామాటల్లోగల అర్థం గ్రహించుకోలేక నిర్ఘాంతపోయి, "ఏంవిటండీ తమరు శెలవిస్తున్నది?" అని ప్రశ్నించాడు. వృద్ధుడు కమలు చేతపట్టుకొని అదేపనిగానవ్వుతూ, "నాయనా! దేవుడు అన్ననోటనే తిరిగీ అనిపిస్తాడు. మీ పింతండ్రి నీజాతి పోయిందన్నాడుగా! తనజాతి అసలుకే పోయిందని పలవరిస్తూ నీరాక కోసం ఎదురుచూస్తున్నాడు. మనం సాయంకాలం స్టేషనుకు వెళ్లి అన్నిసంగతులూమాట్లాడుకుందాం. కాస్సేపు నిద్రపో!" అన్నాడు.

* * * * * *

ప దే శ్లో

# ౧౦

దీపాలు వెలిగించి ఘంటసేపయింది. బండికి ఇంకా ఘంట వేళవుండగానే కమలుడు వంటప్రయత్నం చేయించాడు. భోజనాలు ముగిసి అందరూ సిద్ధంగా వున్నారు. వృద్ధునికి రాత్రిభోజనం అలవాటులేదు. దాసీ సమేతంగా అందరూ వక "మోటారుకారు" లో కూర్చున్నారు. కనుఱెప్పపాటు సమయంలో స్టేషనుకు ఫర్లాంగులోవున్న "ట్రావలర్సు బంగాళా" చేరింది "కారు"—

దుర్గారావు ప్రేమవతితో కలిసి కమలుణ్ణి సమీపించాడు. ప్రేమ సరసని పలకరించింది. దుర్గారావు కమలుణ్ణి పలకరించాడు. కమలుడు నిశ్చేష్టితుడై పోయాడు. తనమీద తనకే నమ్మకం లేకపోయింది. మాట్లాడలేక, ఱెప్పవాల్చకుండా అతడు దుర్గారావునీ ప్రేమనీ ఆపాదమస్తకమూ చూస్తూవూరుకున్నాడు. ప్రేమ గంభీరస్వరంతో, "అన్నయ్యా! నాతో మాట్లాడదలచుకోలేదా యేమిటి? నే నేమైన తప్పు చేశానని వూహిస్తున్నావా? నువ్వు ప్రేమించిన పిల్లని ఎట్లా పెళ్లాడావు? అట్లాగే నేను దుర్గారావుని పెళ్లాడాలని నిశ్చయించుకున్నాను. పెళ్లి అయింతర్వాత ఘనవూ రొస్తాను. నిన్నూ వదినెనీ చూడాలనే ఇక్కడికి వచ్చాను" అంటూ అతని ప్రక్కనే సరస ఒడిలో కూర్చున్న శిశువుని లాక్కుంది. ముద్దా

డుతూ వుంది. కమలుడు, కారులోనుండి పైకివచ్చి, దుర్గా రావు చేతిని గట్టిగా పట్టుకుని; "ఏంరా, నీవుద్దేశం నాతో ముందుగా చెప్పకపోయావా? ఆనాడే మా ప్రేమని నీకిచ్చి మన వూళ్లోనే మహా వైభవంగా పెళ్లి జరిపించి వుందునే. నీపెళ్లితో నాకష్టాలు గట్టెక్కిపోయేవేగా!" అని వాడి భుజం మీద చెయ్యివేసి ప్రేమని వాడిప్రక్కనే నిలబడమని ఆజ్ఞా పించాడు—"అయ్యా! వీళ్లిద్దర్నీ మనఃపూర్వకంగా ఆశీర్వదించండీ" అని వృద్ధుని కోరగానే అత డివతలకు వచ్చి ప్రేమవతీ దుర్గారావు లిద్దరినీ దీవించాడు. మోటారు స్టేషనువైపు తిరిగింది. ఇంకా అరఘంటసమయంవుంది బండికి. టికెట్లు తీసుకున్నారు. బండిరాగానే వాళ్లందరూ ప్రత్యేకంగా వక కంపార్టుమెంటు చూసుకుని కూర్చున్నారు. అవధానిగారి పింతండ్రి బండి ప్లాటుఫారంవిడిచిపెట్టేవరకూ కమలునితో మాట్లాడుతూ అతనిప్రక్కనే కూర్చున్నాడు. అతడు కమల్‌తో మాట్లాడుతూ వున్నంతసేపూ విశ్వేశ్వరుడు తాతగారి ఒడిలోనే కూర్చుండి నిద్రపోయాడు. ఘంట కొట్టారు. తాతగారు దిగలేక దిగలేక బండినుండి ప్లాటుఫారంమీద కాలు పెట్టారు. సరస రెండు చేతులు జోడించి వృద్ధునికి నమస్కరించింది. మాట్లాడలేక పోయింది. అతడుకూడా ఆశీర్వాదపూర్వకంగా చేతులూపుతూ కన్నీరుకారుస్తూ బండి వెళ్లిపోయినా యాత్రికులూ ప్రయాణికులూ అందరూ ఒక్కరేనా మిగలకుండాపోయినప్పటికీ అక్కడే

ఎంతోసేపు నిలబడిపోయాడు. అత డెవరివైపు వుద్దేశించి చేతు లూపుతున్నాడో దైవమే తెలుసుకోవాలి. ప్లాటుఫారా నికి కాపున్న లాంతరు స్తంభాలుమాత్రం అతని కళ్లనుండి కారు తూ వున్న కన్నీటిని బిందువుల్ని చూస్తూ, తాముకూడా మరి చూడలేమో అన్నట్లు కాంతి తప్పి మిణుకు మిణుకు మం టున్నాయి.

*　　　*　　　*

అది పల్లెటూరుకదూ! వక యింటిచుట్టం వూరంతటికీ చుట్టమేను. కమల్ కుటుంబంతోసహా వచ్చి ఈ పర్యాయం తన పింతండ్రిగారివాకిట బళ్లు ఆపించాడు. నౌకరు, వెట్టివాడు, గుమాస్తా, ఇరుగు పొరుగు అందరూ రామ్మూర్తిపంతులు మంచాన్ని గిర వేసీశారు. వయసుమళ్లిన వితంతువులు, "నారా యణ, నారాయణ" అంటున్నారు. కమలుడు మంచం సమీా పించి—"బాబయ్యా!" అని పిలిచాడు. రామ్మూర్తిపంతులు గారు కళ్లు విప్పి, ఆ శక్తి ఎక్కడవచ్చిందోకాని, "నాయన! రా!" అన్నాడు. అతని కౌగిలి విడిపించుకోవడం దుర్లభమైంది కమలుడికి. తర్వాత కమలుడు ప్రేమని పింతండ్రియెదుట నిల బెట్టాడు. ప్రేమవతిని పంతులుగారు కౌగిలించుకోపోగా ఆమె అందికదా, "వద్దు. వద్దు. నాన్నా! దూరంగా వుంటాను. చూచి ఆనందించండి, ఇక్కడ వున్నవాళ్లంతా మిమ్మల్ని వెలి వేస్తారు" పంతులు శక్తి క్షీణించటంచాత ఆమెకు బదులు

చెప్పలేక కష్టంతో రెండుచేతులు యెత్తి ఆశీర్వదించాడు. అతని మొగాన జీవకళ ఆవరించింది.

*　　　*　　　*

కొడుకు కూతురు వూళ్లోకి వచ్చిన 10 దినాలకు రామ్మూర్తిపంతులుగారు బాగా తేలి ఇంట్లో అటూ యిటూ నడవడం ప్రారంభించారు. కమలుడు చెన్నపట్నం తంతియిచ్చి ఆర్యమతప్రచారకుణ్ణి తెప్పించాడు. సంక్రాంతి పండగ ఇంకా మూడు రోజు లుంది. వూళ్లో ప్రతీవాకిటా ముగ్గులుపెట్టారు. తోరణాలతో ద్వారా లలంకరించారు. గుమ్మాలకు పసుపు పూసి కుంకుమబొట్లు పెట్టారు. ఏవో కొన్ని కాలక్షేపానికి జరగని కొంపలు తప్ప వూరంతా శోభాయమానంగా వుంది. జమీందారీ గ్రామం కాబట్టి కమలుడు పేదకొంపల వాళ్లకి డబ్బిచ్చి సున్నాలూ చుక్కలూ పెట్టమని ఆజ్ఞాపించాడు. ఇక ఆవూరు శోభ చూడవలసిందే కాని వర్ణించటానికి మాటలు చాలవు. పెద్ద పెద్ద పట్నాలనుండి సంగీత విద్వాంసులు—సొన్నాయిమేళగాళ్లూ వచ్చి వున్నారు. సనాతన పండితోత్తములు చాలామంది సంభావనల కాసపడి వచ్చారు. ఆర్యపండితులు సనాతనులు దుర్గారావు పెళ్లి గురించి చర్చించుకుంటున్నారు. సనాతనులు ఓడిపోయారు. పండగనాడే ముహూర్తం. రామ్మూర్తిపంతులుగారు వుల్లాసంగా కన్యాదానం చేశారు. నాటి ఉత్సవం ముగిసింది. మర్నాడు సాయంకాలం వూరు

మధ్యనుగల దేవాలయమండపంలో సభ అని చాటింపించాడు కమలుడు. ఇంతో అంతో చదువుకున్న వాళ్లందరూ సభకి వచ్చారు. సభలో చర్చనీయాంశం ఏమంటారా? జాతిభేదం గురించి చర్చ జరిగింది. అందరూ శ్రద్ధగా విన్నారు. ఆ సభ లోనే కొందరు బ్రాహ్మణులు శూద్రులు కూడా ఆర్యమతం స్వీకరించారు. నాటినుండి ఆవూళ్లోవున్న అన్నిజాతులవారూ ఐకమత్యంతో వుంటున్నారు.

సభ ముగిసి ఎవరిగూటికి వారు చేరినతర్వాత తపాలా బంట్రోతు కమలునికి ఒకవుత్తరం తెచ్చియిచ్చాడు.—

"ఆర్య!

మీరు వెళ్లినతర్వాత విశ్వేశ్వర్రావుకోసం బెంగ పెట్టుకుని మా పింతండ్రిగారు మంచంపట్టారు. మీరు ఎంత త్వరలో ఆ పసివాణ్ణి తెచ్చి అతని కళ్లయెదుట పెడితే అంత పుణ్యం వుంటుంది.

వెంకటావధాని"

కమలుడు పెళ్లిబడలిక తీర్చుకోనేలేదు. సరసనీ కొడుకునీ తీసుకుని వెంటనే కాశీకి ప్రయాణమైనాడు. విశ్వేశ్వర్రావుని తాతగారియెదుట పెట్టాడు. వృద్ధుడు కళ్లార తాను పెంచిన శిశువుని చూసుకుని ఆశీర్వదించటానికి కూడా శక్తి

లేకపోవుటచాత మొగం అవతలకి త్రిప్పుకుని కాశీవిశ్వనాథుణ్ణి కలుసుకోవడానికి శాశ్వతంగా కళ్లు మూసీశాడు.

సరసా కమలులు వెంకటావధానితో సహా దుఃఖం సూచిస్తూ కన్నీరు కార్చారు. చచ్చేకాలానికి వృద్ధుణ్ణి తిరస్కరించాను గదా అని వెంకటావధాని భోరుమని యేడ్చాడు. తన తండ్రికివలెనే కమలుడు ఆ వృద్ధునికి శ్రాద్ధకర్మ చేయించాడు. న్యాయంగా వెంకటావధాని ఆ ఖర్చు పెట్టవలసింది కదా! ఎవరికి ఎవరు కొడుకులు?

